# హస్తరేఖా శాస్త్రము

V.R.K. లక్ష్మీమోహన్ B.A.

జ్యోతిస్నాతక్, కలకత్తా




**శ్రీ కళ్యాణ్ పబ్లికేషన్స్**

Opp. ఐలాపురం హోటల్,

గాంధీనగర్, విజయవాడ- 520 003

ఫోన్: 627484, 437484

# HASTAREKHA SASTRAM

by V.R.K. LAKSHMI MOHAN B.A.



FIRST EDITION

*July 2002*

PAGE MAKERS

*VISWA DIGITALS*

*Annapoorna devi Street,*

*Gandhi Nagar, Vijayawada-3*

*Ph. 400023*

COVER DESIGN

*RAMANA*

PRINTED AT

*SWAMY OFFSET*

*Gandhinagar, Vijayawada-3*

PUBLISHED BY

*SRI KALYAN PUBLICATIONS*

*Opp. Hotel Ilapurm, Gandhinagar*

*Vijayawada-520 003*

*PRICE:* Rs. 25/-

# హస్తరేఖలు

## అరచేతిలోని రేఖలు



వి.ఆర్.కె. లక్ష్మీమోహన్

# అరచేతిలో ఉండు గ్రహస్థానములు




1. గురుస్థానం
2. శనిస్థానం
3. రవిస్థానం
4. బుధస్థానం
5. మొదటి కుజస్థానం
6. రెండవ కుజస్థానం
7. చంద్రస్థానం
8. శుక్రస్థానం
9. రాహుస్థానం

## తక్కువ రేఖలున్న హస్తము



ఇది సామాన్య హస్తము. ఇలా ఉండే సామాన్య జీవితం ఉంటుంది పలుకుబడి లేని జీవితం ఉంటుంది.

1. జీవిత రేఖ

2. బుద్ధి రేఖ

3. ఆత్మ రేఖ

## ఎక్కువ రేఖలున్న చిత్రం

ఇలా ఎక్కువ రేఖలున్నవారు మంచి పేరు, కీర్తి, ప్రతిష్ఠలు ధనము, పలుకుబడి సంపాదిస్తారు. మంచి స్థాయికి ఎదుగుతారు.



1. జీవితరేఖ 2. కుజరేఖ 3. ఆత్మరేఖ 4. బుద్ధిరేఖ
5. అదృష్టరేఖ 6. బుధరేఖ 7. సూర్యరేఖ 8. శుక్రరేఖ
9. యోగరేఖ 10. వివాహరేఖలు

## అరచేతిలో ఉండు రేఖలు

1. జీవిత రేఖ లేదా ఆయుష్య రేఖ
2. కుజరేఖ లేదా సోదర ఆయుష్య రేఖ
3. ఆత్మరేఖ లేదా హృదయ రేఖ
4. బుద్ధి రేఖ లేదా శిరోరేఖ
5. అదృష్ట రేఖ లేదా ధనరేఖ
6. బుధ రేఖ లేదా వ్యాపార రేఖ
7. సూర్య రేఖ లేదా రవి రేఖ
8. శుక్రవంక లేదా శుక్రచాపము
9. యోగరేఖ
10. వివాహ రేఖలు
11. సంతాన రేఖలు
12. మణికంకణ రేఖలు

## వ్రేళ్ళు

1. గురు వ్రేలు లేదా చూపుడు వ్రేలు
2. శని వ్రేలు లేదా మధ్య వ్రేలు
3. రవి వ్రేలు లేదా ఉంగరం వ్రేలు
4. బుధ వ్రేలు లేదా చిటికిన వ్రేలు
5. బ్రొటన వ్రేలు లేదా అంగుష్ఠము

## స్థానములు

1. గురుస్థానము
2. శనిస్థానము
3. రవిస్థానము
4. బుధస్థానము
5. చంద్రస్థానము
6. శుక్రస్థానము
7. రాహుప్రదేశం

# గ్రహస్థానములు



## వ్రేళ్ళు



# అరచేయిలోని భాగములు



1. వ్రేళ్ళు    2. అరచేయి    3. చేయి    4. వ్రేలు పర్వములు

ప్రతీ వ్రేలుకు మూడు పర్వములు (భాగములు) ఉంటాయి. మొదటి పర్వము, రెండవ పర్వము, మూడవ పర్వము.

## వ్రేళ్ళు

1. వ్రేళ్ళు కొందరికి చాలా పొడవుగా ఉంటాయి. అలా ఉండటం అంత మంచిది కాదు. అలా ఉంటే వాళ్ళు ప్రతీ చిన్న విషయానికి కూడా ఎక్కువ శ్రద్ధ చూపిస్తారు.
2. కొందరికి వ్రేళ్ళు మధ్యరకంగా ఉంటాయి. వీరికి తెలివి తేటలు, ఆలోచన శక్తి ఉంటాయి.
3. కొందరికి వ్రేళ్ల చాలా పొట్టిగా ఉంటాయి. ఇలా ఉండటం మంచిదికాదు. వీరికి ఆలోచనాశక్తి తక్కువ. మూర్ఖత్వం ఉంటుంది.

## చేతులు వ్రేళ్ళు

1. అరచేయి మరియు వ్రేళ్ళు కూడా సమానంగా ఉండటం చాలా మంచిది. వీరికి మంచి తెలివితేటలు, న్యాయమైన ఆలోచన, మంచి స్వభావం ఉంటుంది. వీరు ఆలోచించి పనులు చేస్తారు.
2. కొందరికి వ్రేళ్ళు నాలుగు పలకలుగా ఉండి అరచేయి పొడవుగా ఉంటుంది. ఇలాంటివారు వ్యాపారానికి బాగా పనికివస్తారు.
3. కొందరి చేతులలో వ్రేళ్ళు చాలా దూరం, దూరంగా ఉంటాయి. వ్రేళ్ళ మధ్య సందులు బాగా ఉంటాయి. వీరికి మంచి ధైర్యము తెలివితేటలుంటాయి.
4. కొందరికి చేతిలోని వ్రేళ్ళు మొనలుదేరి ఉంటాయి. వీరికి మంచి ఆలోచనా శక్తి, గ్రహణశక్తి ఉంటుంది.
5. అరచేయి మరీ పొట్టిగావుంటే మూర్ఖత్వం, ఆలోచనా శక్తి తక్కువగా ఉంటుంది.
6. చిన్నదిగా అరచేయి ఉంటే ఆలోచన, తెలివితేటలుంటాయి.
7. అరచేయి పొడవుగా ఉంటే ప్రతీ పనిని జాగ్రత్తగా చేసి మంచి ఫలితములు సాధించుకుంటారు.
8. అరచేయి చాలా పొడవుగా ఉంటే అతి జాగ్రత్తతో ప్రతీ పనిని సంపూర్ణంగా, లోపం లేకుండా చేయాలనుకుంటారు.

## వ్రేళ్ళు

**1. గురువ్రేలు:** విద్యయందు ఆసక్తి, అధికారము, పలుకుబడి, అహంకారము మొదలగు విషయములను తెలుపుతుంది.

**2. శనివ్రేలు:** దేవుని మీద నమ్మకం, కష్టములు, సుఖాలు, ధైర్యసాహసములను తెలుపుతుంది.

**3. రవివ్రేలు:** చదువు, కీర్తి ప్రతిష్ఠలు, క్రమశిక్షణ, మంచి ప్రవర్తన తెలియజేస్తుంది.

**4. బుధునివ్రేలు:** ఆరోగ్యము, వ్యాపారము, తెలివితేటలు గురించి తెల్పుతుంది.

**5. బొటనవ్రేలు:** పలుకుబడి, పట్టుదల, ప్రేమ, జాలి, దయ గురించి తెలుపు తుంది.

## బొటన వ్రేలు

1. బొటనవ్రేలు మరీ చిన్నదిగా ఉండకూడదు. వారికి ఆలోచన, పట్టుదల, కార్యదీక్ష తక్కువ.
2. బొటనవ్రేలు పొడవుగా ఉంటే మంచిది. వారికి పట్టుదల కార్యదీక్ష, ఆలోచనా శక్తి ఉంటాయి.
3. బొటనవ్రేలు మరీ పొడవుగా ఉండటం మంచిది కాదు.
4. బొటనవ్రేలు 90 డిగ్రీలలో ఉంటే స్వతంత్ర ఆలోచనలు, పట్టుదల మంచి మనసు ఉంటాయి.
5. బొటనవ్రేలు వెనకు వంగిఉంటే వారికి జాలి, ప్రేమ, దయాగుణములుంటాయి.

## గోళ్ళు

1. గులాబిరంగులో గోళ్ళు ఉంటే ఆ వ్యక్తికి ఆరోగ్యం, ఆదాయం, సుఖసంతోషాలు బాగా ఉంటాయి.
2. గోళ్ళు నలుపుగా, తెలుపుగా ఉంటే అంతమంచిది కాదు.
3. గోళ్ళపై నిలువు గీతలుంటే అనారోగ్యం, బలహీనతలు తెలుపుతాయి.

# గ్రహస్థానములు

ప్రతీ వేలు అడుగు భాగములో ఉండే భాగాన్ని గ్రహస్థానములు అంటారు. అ గ్రహస్థానము పైకి లేచి ఉన్నట్లయితే గ్రహస్థానం బాగున్నట్లు. కాని ఈ భాగం చదునుగా ఉంటే బాగా లేనట్లు. గ్రహస్థానం బాగుంటే అది దానికి సంబంధించిన మంచి ఫలితాలనిస్తుంది. చదునుగా ఉంటే చెడు ఫలితాలనిస్తుంది.

**1. గురుస్థానం** : గురువ్రేలు క్రిందభాగంలోనున్న ఈ గురుస్థానం బాగా పైకి లేచి (ఉబ్బి) ఉన్నట్లయితే ఈ గ్రహస్థానం బాగున్నట్లు. అది బాగున్నట్లయితే ఆవ్యక్తికి ఆత్మాభిమానం, పట్టుదల, ఆత్మ విశ్వాసం, కార్యదీక్ష ఉంటాయి. వీరు కోరుకున్నది సాధించు కొని తీరుతారు.

**2. శనిస్థానం** : శనిస్థానం బాగా పైకిలేచి బాగున్నట్లయితే వారికి దేవునిపై నమ్మకం, కోపం, ఆలోచనాశక్తి, ఉదార స్వభావం ఉంటాయి. వీరు పదిమందికి మంచి చేస్తారు.

**3. రవిస్థానం** : ఈ రవిస్థానం బాగున్నట్లయితే వీరు మంచి విద్యావంతులు అయి మంచి ఉద్యోగములు, పలుకుబడి, కీర్తిప్రతిష్టలు సంపాదిస్తారు.

**4. బుధస్థానం** : బుధస్థానం బాగుంటే ఆరోగ్యం, వ్యాపారం, తెలివితేటలు, మంచి లౌకిక జ్ఞానం ఉంటాయి.

**5. చంద్రస్థానం** : చంద్రస్థానం బాగుంటే మంచి ఆలోచనా శక్తి, తెలివితేటలు, ప్రేమ, అదృష్టం, సుఖం ఉంటాయి.

**6. శుక్రస్థానం** : శుక్రస్థానం బాగుంటే ప్రేమ, జాలి, కుటుంబ జీవితం, పరుల సహకారం లభిస్తుంది.

7. రాహుప్రదేశం బాగుంటే జీవితం బాగుంటుంది. ఆర్థికంగా బాగుంటుంది. వృత్తి కలసి వస్తుంది.
8. అరచేయి గులాబిరంగులో ఉంటే అదృష్టం.
9. అరచేయి తెలుపు, నలుపురంగులో ఉంటే సాధారణ జీవితం ఉంటుంది.

# అరచేయి

1. కొందరికి అరచేయి లావుగా, మందంగా ఉంటుంది. ఇలా ఉండటం అంత మంచిదికాదు. వారికి మోటుదనము, మూఢవిశ్వాసాలుంటాయి. వీరికి ఆలోచనా శక్తి తక్కువ.
2. కొందరికి అరచేయి పలుచగా ఉంటుంది. ఇలా ఉంటే మంచిది. వీరికి మంచి ఆలోచనా శక్తి, చురుకుదనము, ఓర్పు, తెలివితేటలుంటాయి.
3. అరచేయి రాయిలాగా కఠినంగా ఉంటే మంచిదికాదు వీరికి జాలి, దయ, ప్రేమ ఉండదు.
4. అరచేయి కొంచము గట్టిగా ఉన్నవారికి పట్టుదల, కార్యదీక్ష ఉంటాయి. అనుకొన్నవి సాధించుకొంటారు.
5. అరచేయి మరీ మెత్తగా ఉంటే అంత మంచిది కాదు. వీరికి పట్టుదల, కార్యదీక్ష వుండదు. చెడు అలవాట్లు ఉండే ప్రమాదం ఉంది.
6. అరచేయి కోమలంగా, గులాబిరంగులో ఉంటే మంచిది. వీరికి ఆదాయం, ఆరోగ్యం, సుఖసంతోషాలుంటాయి.
7. అరచేయి మోటుగా, కఠినంగా, నల్లగా, ఉంటే దరిద్రము. సరిమైన సంపాదన, సుఖము ఉండదు. వీరికి అనేక కష్టములు వస్తాయి. నిలకడ అయిన ఆదాయం, వృత్తి ఉండదు.

## అరచేతులలో రకాలు

1. కొందరి చేతులు పొడవు, వెడల్పు సమానంగా ఉంటాయి. వారిచేతి గోళ్ళు కూడా చతురస్రాకారంగా ఉంటాయి. ఇలాంటి చేతులు కలవారికి మంచి ఆలోచనలు, నీతి నియమాలుంటాయి. మంచి మార్గంలో ప్రయాణిస్తారు. మంచిని ఆలోచిస్తారు. మంచి పనులు చేస్తారు. సంపాదిస్తారు. సుఖపడతారు. వీరికి జాలి, దయ, మంచి గుణాములుంటాయి. మంచి పనులు చేస్తారు. మంచి అనిపించుకొంటారు. మంచి గౌరవము, పేరు సంపాదించుకొంటారు.

2. **విస్తరించి ఉన్న చేయి** : వీరికి అరచేయి క్రింది భాగము వెడల్పుగా ఉంటుంది. వ్రేళ్ళు దూరం దూరంగా ఉంటాయి. ఇలా ఉన్నవారు మంచి ధైర్యసాహసాలు కలిగి ఉంటారు. ఉత్సాహంగా ఉంటారు. అనుకొన్న పనిని సాధిస్తారు. క్రొత్త క్రొత్త విషయాలు కనిపెడ్తారు. వీరు ఎల్లప్పుడు మార్పును కోరుకొంటారు. సంపాదిస్తారు. మంచిపేరు, గౌరవం సంపాదిస్తారు. వీరికి ప్రయాణములు చేయడమంటే చాలా ఇష్టం.
3. కొన్ని చేతులలో వ్రేళ్ళు వంగి ఉంటాయి. వంకరగా ఉంటాయి. వీరిది ఆధ్యాత్మిక హస్తము అంటారు. అందువల్ల వీరికి దేవుడు ఉన్నాడన్న నమ్మకం ఉంటుంది. దైవచింతన ఉంటుంది. దైవకార్యక్రమములు, ధర్మకార్యక్రమములు చేస్తుంటారు. వీరికి సంసార జీవితం ఆనందంగా ఉండదు. ఒంటరి జీవితమును అనుభవిస్తారు.
4. **కళాహస్తము** : వీరికి వ్రేళ్ళు చివరలో మొనదేలి ఉంటాయి. రాను, రాను సున్నగా, మొనదేలిన వ్రేళ్ళు ఉంటాయి. ఇలా ఉన్న హస్తమును కళాహస్తము అంటారు. వీరికి కళలయందు ఇష్టము ఉంటుంది. వీరు కళలలో మంచి పేరు సంపాదించుకొంటారు. నటులు, కవులు, గాయకులు, కాగలరు. ఇతరులను ఆకర్షించగల శక్తి వీరికి ఉంటుంది.
5. **మొనదేరిన హస్తము** : వీరి చేతిలో వ్రేళ్ళు సన్నగా, పొడవుగా మొనదేలి ఉంటాయి. వ్రేళ్ళు చాలా కోమలంగా, అందంగా ఉంటాయి. వీరికి సున్నిమైన మనస్సు ఉంటుంది. దైవభక్తి ఉంటుంది. శాంతిని కోరుకొంటారు. ఏకాంతమును కోరుకొంటారు. వీరు ఎల్లప్పుడు ఊహా ప్రపంచములో మునిగి ఉంటారు. వీరికి సంసార సుఖమందు కోరిక ఎక్కువ. సుఖపడతారు.
6. **మోటుహస్తము** : చిన్నచేతులు, చిన్న వ్రేళ్ళు, మోటుగా గట్టిగా అసహ్యంగా ఉంటాయి చేతులు. ఇలా ఉండటం మంచిదికాదు. వీరికి ఆలోచన తక్కువ. తెలివితేటలు, లౌకిక జ్ఞానం ఉండదు. నిలకడలేని ఆలోచన, నిలకడలేని వృత్తి, ఆదాయంలేక బాధలు పడుతుంటారు. ప్రతీ రోజు ఒక నరకంగా గడుస్తుం టుంది వారికి. వీరికి వివాహ జీవితం కూడా బాగుండదు. సుఖపడలేరు.

1. **చతురము** : నాలుగు గీతలతో ఏర్పడిన గుర్తు.

2. **త్రిభుజము** : మూడు రేఖలచే ఏర్పడిన కోణము గుర్తు.

3. **వృత్తము** : గుండ్రముగా ఏర్పడి ఉన్న గుర్తు.

4. **లంక** : ఒక రేఖ మధ్య సున్నా ఆకారంలో ఏర్పడిన గుర్తు.

5. **చతురంగపాళి** : నిలువు, అడ్డంగా కొన్ని రేఖలవల్ల ఏర్పడ గుర్తు.

6. **త్రిశూలము** : ఒక రేఖ చివరి భాగంలో మూడు రేఖలు పాయలుగా చీలి ఉన్న గుర్తు.

7. **నిచ్చె రేఖలు** : నిచ్చెనవలె పలు రేఖలతో ఏర్పడిన గుర్తు.

8. **ఊర్ధ్వ రేఖలు** : నిలువు పైకి ఉన్న రేఖలు.

9. **అథమ రేఖలు** : క్రిందికి ఏర్పడి ఉన్న రేఖల గుర్తు.

# గ్రహస్థానముల మీద గుర్తులు వాటి ఫలితాలు

## గురుస్థానము

1. గురుస్థానం పై ఒక నిలువు రేఖ ఏర్పడి ఉంటే ఆ వ్యక్తికి నలుగురిలో గౌరవం, పలుకుబడి, గుర్తింపు ఉంటుంది. మంచి పొజిషన్‌లో ఉంటారు.
2. ఒక నిలువు రేఖ ఏ స్థానంలో ఉన్నను మంచి ఫలితాన్ని ఇస్తుంది.
3. గురుస్థానం పై రెండు నిలువురేఖలు ఏర్పడి ఉన్నచో పనులు ఆలస్యంగా, కష్టంతో సాధ్యపడుతాయి.
4. గురుస్థానంలో ఒక ప్రత్యేకమైన కత్తెరగుర్తు ఏర్పడి ఉంటే మంచి భార్య అనుకూలమైన దాంపత్య జీవితం, భార్య వల్ల స్థిరాస్థులు సుఖశాంతులు పొందుతారు.
5. గురుస్థానంలో నిచ్చెన రేఖలు ఏర్పడి ఉన్నట్లు అయితే అనేక కష్టములు, ఆర్థిక నష్టములు వచ్చును.



6. గురుస్థానంలో పుట్టుమచ్చ ఏర్పడి ఉంటే అపకీర్తి, ఆర్థిక నష్టములు, మానసిక ఇబ్బందులు కలుగుతాయి.
7. గురుస్థానంలో చాలా రేఖలు ఏర్పడి అవి ఒకటి ఇంకొకదానిని ఖండిస్తున్నట్లు ఉంటే అన్ని ప్రయత్నములు విఫలం అవుతాయి. నీతిలేని, చెడు అలవాట్లు గల జీవితం గడుపుతారు.
8. గురుస్థానం పై చతురంగపాళి గుర్తు ఏర్పడి ఉంటే చెడుగుణములు. చెడు అలవాట్లు, చెడు నమ్మకములు కలిగి ఉంటారు.
9. గురుస్థానం పై ఏర్పడిన నిలువు రేఖను ఇంతర రేఖ ఖండించినట్లయితే పలుకుబడి, వృత్తిలో నష్టపోతారు.
10. గురుస్థానంలో నక్షత్రం ఏర్పడి ఉంటే స్థిరాస్థులు, మంచి పేరు, పదవి లభిస్తాయి.
11. గురుస్థానము : గురుస్థానం నందు చతురము గుర్తు ఏర్పడి ఉంటే ఆ వ్యక్తికి సంఘములో మంచిగౌరవము, పలుకుబడి, పేరు ఉంటాయి. వారు మంచి పోజిషన్‌లో ఉంటారు. గురుజాతకులు ఎత్తుగా, లావుగా, గంభీరంగా ఉంటారు.
12. గురుస్థానంలో త్రికోణం గుర్తు ఉంటే ఆ వ్యక్తికి మంచి తెలివితేటలుంటాయి. వీరు రాజకీయాలలో బాగా గుర్తింపు పొందుతారు.
13. గురుస్థానములో వృత్తము గుర్తు ఉంటే వ్యాపారములో బాగా సంపాదిస్తారు. ప్రతీ పనిలో విజయం సాధిస్తారు.
14. గురుస్థానంలో లంక గుర్తు ఉంటే ఆ వ్యక్తికి ఎక్కువగా ఇతరులవల్ల మోస పోతుంటాడు.
15. గురుస్థానంలో చంద్రవంక గుర్తు ఉంటే ఆ వ్యక్తికి అతని ఆశలు ఫలించవు. అపజయాలు ఎదుర్కొంటాడు.

అరచేతిలో గురుబలం చాలా బాగుంటే ఆ వ్యక్తికి మంచి పలుకుబడి, గౌరవం, మంచి పోజిషన్ ఉంటాయి. బాగా సంపాదిస్తారు. మంచి సంసార జీవితం ఉంటుంది. భార్యవల్ల స్థిరాస్థులు వస్తాయి. సుఖసంతోషాలుంటాయి. వీరు అనుకొన్నవి సాధించుకొని తీరుతారు. దానధర్మాలు, తీర్థయాత్రలు చేస్తారు. వీరి మాటకు తిరుగు ఉండదు. అనుకొన్న పనిని ధైర్యంగా చేసి తీరుతారు. ఓటమి

అంగీకరించరు. ప్రేమించిన వారి కొరకు ప్రాణాలు కూడా ఇస్తారు. నమ్మినవారికి ఎలాంటి సహాయం అయినా చేస్తారు. వీరి స్నేహం, ప్రేమ పొంద కలిగినవారు చాలా అదృష్టవంతులు.

అరచేతిలో గురుస్థానం బాగున్నప్పుడు పైన చెప్పిన ఫలితాలు అన్నియు జరుగుతాయి. గురుబలం లేని యెడల ఫలితాలు జరగటం కష్టం. గురుబలం ఉండటం చాలా మంచిది. ఉండటం మంచి అదృష్టం.

## శని స్థానము

అరచేతిలో శనిస్థానము బాగుంటే మంచిది. అయితే శనిస్థానము చాలా బాగుండటం వల్ల కొంత మంచిది కాదు. శనిస్థానం చాలా బాగున్నవారికి దేవునిపై నమ్మకం చాలా ఎక్కువగా ఉంటుంది. దైవకార్యక్రమములు చేస్తారు. వీరు ఏకాంతాన్ని కోరుకొంటారు. వీరు భార్యాపిల్లల్ని వదలి సన్యాసులుగా మారే అవకాశం ఉంటుంది. సన్యాసులుగా, బాబాలుగా, మంత్రగాళ్ళుగా, జ్యోతిష్యులుగా పేరు సంపాదించుకొనే అవకాశం ఉంది. వీరు సమాజానికి సేవ చేస్తారు. నలుగురికి లాభం చేస్తారు. స్వార్థం ఉండదు. కోరికలుండవు. రేపుగురించి ఆలోచించరు. అందుకే వీరికి వివాహ జీవితం కలసిరాదు. అరచేతిలో శనిస్థానం బాగుంటే వీరిని శనిజాతకులుగా గుర్తించవచ్చును. వీరికి దివ్యదృష్టి ఉంటుంది. వీరి మాట నిజం అవుతుంది. వీరి వాక్కు ఫలిస్తుంది. శని జాతకులు సన్నగా పొడవుగా ఉంటారు.




అరచేతిలో శనిస్థానం ఒక మాదిరి గానే ఉండటం చాలా మంచిది. శని జాతకు లకు స్వార్థం ఉండదు. నలుగురికి ఉపయోగపడా లను కొంటారు.ఉపయోగ పడతారు.

1. ఈ శనిస్థానం పై ఒక నిలువ రేఖ ఏర్పడి ఉంటే చాలా మంచిది. వీరికి గౌరవం, పలుకుబడి గుర్తింపు ఉంటాయి.

2. ఈ శనిస్థానం పై రెండు నిలువు రేఖలుంటే ప్రతీ పని ఆలస్యంగా, శ్రమ మీద జరుగుతుంది.
3. శనిస్థానం పై చాలా నిలువు రేఖలుండటం మంచిది కాదు. అలా ఉండటం వల్ల ఏ పనితల పెట్టిననూ నష్టం వస్తుంది. సమస్యలు కలుగుతాయి.
4. శనిస్థానమునకు అడ్డురేఖలు ఏర్పడి ఉంటే ఆ గ్రహానికి ఉండే బలం తగ్గిపోతుంది. చెడు ఫలితాలు కలుగుతాయి.
5. శనిస్థానంపై చతురంగపాళి ఏర్పడి ఉండటం చాలా ప్రమాదం. చాలా కష్టాలు వస్తాయి. కారాగార ప్రాప్తి జరగవచ్చును. అనేక కష్టములు, ఆర్థిక ఇబ్బందులు ఎదుర్కొంటారు. జీవితం నరకంగా మారుతుంది.
6. శనిస్థానంపై కత్తెర గుర్తుంటే చాలా ప్రమాదం. ఇది ఆ వ్యక్తికి చాలా కష్టములు తెచ్చిపెడ్తుంది.
7. శనిస్థానంపై నక్షత్రము గుర్తు ఉంటే ఆర్థికనష్టములు, దీర్ఘ వ్యాధులు వచ్చే ప్రమాదం ఉంటుంది.
8. శనిస్థానంపైన శుక్రవంక ఏర్పడి ఉంటే ఆ వ్యక్తికి సుఖరోగములు వచ్చే ప్రమాదం ఉంది.
9. శనిస్థానంపై పుట్టుమచ్చ ఏర్పడి ఉంటే మంచి కంటే చెడు ఎక్కువగా జరుగుతుంది. అపకీర్తి పాలు అవుతారు.
10. శనిస్థానంలో చతురము గుర్తు ఉండటం చాలా మంచిది. ఇది ఆ వ్యక్తికి నష్టములనుండి, వ్యాపార నష్టముల నుండి కాపాడును.
11. శనిస్థానంపైన త్రిభుజం గుర్తు ఉంటే మంచిది. వీరు యోగశాస్త్రంలో, మంత్ర శాస్త్రములో మంచి గుర్తింపు పొందుతారు.
12. శనిస్థానంలో వృత్తము గుర్తు ఉంటే చాలా మంచిది. వీరికి అదృష్ట రేఖ బాగుంటే వ్యాపారంలో బాగా కలసివస్తుంది. బాగా సంపాదిస్తారు. సుఖపడతారు.
13. శనిస్థానంలో త్రిశూలం గుర్తు ఉంటే, క్రొత్త విషయాలు కనుగొంటారు. మతము, దైవకార్యక్రమములలో అభిరుచి చూపిస్తారు.
14. శనిస్థానంలో చంద్రవంక గుర్తు ఉండటం మంచిదికాదు. ఆ వ్యక్తికి మానసిక ఉద్రేకము, మానసిక రోగములు రావచ్చును.

# సూర్యస్థానము

అరచేతిలో సూర్యస్థానము బాగుంటే చాలా మంచిది. సూర్యస్థానం బాగున్నప్పుడు ఆవ్యక్తి బాగా చదువుకొనే అవకాశం మంచి ఉద్యోగం, మంచి ఉన్నతమైన స్థాయికి చేరే అవకాశం ఉంటుంది. వీరిని సూర్య జాతకులు అంటారు. వారు విద్యావంతులు అవుతారు. కీర్తి, ప్రతిష్ఠలు సంపాదిస్తారు. సమాజానికి సేవ చేస్తారు. మంచికి విలువనిస్తారు. మంచి ప్రవర్తన, మంచి అలవాట్లు, ధర్మ, న్యాయమైన మార్గాలను ఎన్నుకొంటారు. స్వయంకృషిపై పైకి వస్తారు. అనుకొన్నవి సాధిస్తారు. సమాజానికి మంచి చేస్తారు. వీరు చాలాఅందంగా, ఆకర్షణీయంగా కన్పిస్తారు. వీరికి కుటుంబ జీవితం చాలా బాగుంటుంది. మంచి స్థానం, మంచి అలవాట్లు కల్గియుంటారు. వీరి సంతానం కూడా మంచి యోగ్యులు అయి ఉంటారు. మంచి గౌరవం పొందుతారు. వీరు ప్రతీ పనిని కీర్తి ప్రతిష్ఠలను దృష్టిలో పెట్టుకొనే చేస్తారు. ఎవరికీ తలవంచరు. అనుకొన్న పనిని సాధించి తీరుతారు. ఉంగరం ప్రేలు క్రింద ఉన్న ఈ భాగాన్ని సూర్యస్థానము అంటారు. లేదా రవిస్థానం అంటారు.

1. సూర్యస్థానం పై ఒక నిలువరేఖ ఏర్పడి ఉంటే డబ్బుకాని, కీర్తి ప్రతిష్టలు కాని లభిస్తాయి.
2. సూర్యస్థానంపై రెండు నిలువు రేకలు ఏర్పడి ఉంటే ఎంత ప్రయత్నము చేసినా పూర్తి ఫలితము దక్కదు. సగం ఫలితమే పొందుతారు.
3. ఎక్కువ నిలువు రేకలుంటే ఒక దానిని ఒకటి తాకి ఉంటే అనేక రకములుగా ప్రయత్నములు చేస్తారు. కాని మంచి ఫలితములు లభించవు.
4. సూర్యస్థానంపై పుట్టుమచ్చ ఉంటే అపకీర్తి, ఆర్థికనష్టములు, అపజయములు కలుగును.



5. సూర్యస్థానంపై కత్తెర గుర్తు ఉంటే మంచి ఆశయములు కలిగి గౌరవము పొందుతారు.
6. సూర్యస్థానంపై చతురమున్నట్లయితే విద్యలవలన, కళలలో మంచి సంపాదన, గుర్తిపు పొందుతారు.
7. సూర్యస్థానమున నక్షత్రం గుర్తు ఉన్నట్లయితే మంచి విద్యావంతులై మంచి సంపాదన, కీర్తి ప్రతిష్ట పొందే అవకాశం ఉంది.
8. సూర్యస్థానంలో త్రిశూలం గుర్తు ఉంటే మంచి మాటకారి తనము రాజకీయాలలో గుర్తింపు లభించవచ్చును.
9. సూర్యస్థానంలో వృత్తం గుర్తు ఉన్నట్లయితే కీర్తి, గౌరవం లభిస్తాయి. నేత్ర రోగములు రావచ్చును.
10. సూర్యస్థానంలో త్రిభుజం గుర్తు ఉన్నట్లయితే శాస్త్రజ్ఞానము, కళానైపుణ్యం, కలిగి మంచి అభివృద్ధి పొందుతారు.
11. సూర్యస్థానంలో చతురంగపాళి గుర్తు ఉన్నట్లయితే నిలకడలేని ఆలోచనలు, నిలకడలేని వృత్తిలో కష్టనష్టాలు పొందుతారు.
12. సూర్యస్థానంలో చంద్రవంక గుర్తు ఉన్నట్లయితే ఆ వ్యక్తికి భావోద్రేకము ఎక్కువగా ఉంటుంది.
13. సూర్యజాతకులు మంచి హస్తము కలిగి ఉన్నట్లయితే అరచేతిలో సూర్య రేఖ స్పష్టముగా ఉండి, గురుస్థానం బాగున్నట్లయితే వారు మంచి విద్యావంతులు అయి, మంచి పదవులు పొందుతారు. మంచి గౌరవము, కీర్తి ప్రతిష్టలు లభిస్తాయి. వీరు సమాజానికి సేవచేస్తారు. కీర్తి సంపాదించ టానికి బాగా కష్టపడతారు. మంచి మార్గంలో ప్రయాణం చేస్తారు. మంచి అలవాట్లు, నీతి నియమాలుంటాయి. సాటివారికి మేలు చేస్తారు. కాని హాని చేయరు. వీరు అనుకొన్న పనిని సాధించుకొని తీరుతారు.

# బుధస్థానం

అరచేతిలో బుధస్థానం బాగున్నట్లయితే వీరిని బుధజాతకులు అంటారు. బుధ జాతకులకు మంచి తెలివితేటలు, లౌకిక జ్ఞానం, మాటకారితనం ఉంటాయి. వీరు సామాన్యంగా పొట్టిగా, లావుగా ఉంటారు. వీరు ఎక్కువగా వ్యాపారాలుచేసి సంపాదిస్తారు. వ్యాపారం వీరిరి బాగా కలసివస్తుంది. వ్యాపారంలో సంపాదిస్తారు. ధనవంతులు అవుతారు. మంచి జీవితం గడుపుతారు. వీరికి సంసార జీవితం బాగుంటుంది. నష్టాలువచ్చిన మరల కోలుకొనే అదృష్టం వీరికి ఉంటుంది. బుధ జాతకులకు దైవభక్తి ఉంటుంది. దైవకార్యములు చేస్తారు. తీర్థయాత్రలు చేస్తారు. పేదవారిక సహాయం చేస్తారు.

వీరికి ఆరోగ్యం బాగానే ఉంటుంది. అజీర్ణ వ్యాధులు, చర్మవ్యాధులు రావచ్చును. వీరి తెలివితేటలు వారిని కాపాడతాయి. వీరు కళాకారులుగా కూడా రాణించవచ్చును. బుధుని వ్రేలు క్రింద ఈ స్థానాన్ని బుధస్థానమంటారు.

1. బుధస్థానములో ఒక నిలువురేఖ ఉన్నచో ఆ వ్యక్తికి ఆకస్మిక ధనప్రాప్తి మంచి అభివృద్ధి ఉంటాయి.
2. బుధస్థానంలో చాలా నిలువురేఖలు ఉన్నట్టయితే వైద్యవృత్తిలో మంచి సంపాదన, పేరు సంపాదిస్తారు.



3. బుధస్థానంపైన చతురంగపాళి ఉన్నచో సాహస కార్యక్రమములు చేసి మరణం పొందుతారు.

4. బుధస్థానంలో పుట్టుమచ్చ ఉన్నట్లయితే వ్యాపారంలో నష్టం, సమస్యలు వస్తాయి.

5. బుధస్థానం పైన కత్తెర గుర్తు ఉన్నట్ల యితే వ్యాపారంలో ఎన్నోరకములుగా మాయలుచేసి సంపాదిస్తారు.

6. బుధస్థానంపై వృత్తము గుర్తు ఉన్నట్ల యితే ఇతరుల మోసంవల్ల మరణం పొందు తారు.

7. బుధస్థానంపై చతురము గుర్తు ఏర్పడి ఉన్నచో వ్యాపారంలో బాగా సంపాదిస్తారు. ఆర్థికనష్టములు వస్తే కోలుకొంటారు.

8. బుధస్థానంపై త్రిభుజం గుర్తు ఉన్నట్లయితే మంచి తెలివితేటలు ఆలోచనా శక్తి కలిగి రాజకీయాలలో బాగా రాణిస్తారు.

9. బుధస్థానంపై త్రిశూలం గుర్తు ఉన్నట్లయితే మంచి విజ్ఞానము, తెలివి తేటలుండి పలుకుబడి, కీర్తిప్రతిష్టలు సంపాదిస్తారు.

10. బుధస్థానంపై చంద్రవంక ఉన్నచో ఆలోచనలు లేని తాహతుకు మించిన కార్యక్రమములు చేసి నష్టపోతారు.

11. బుధస్థానం ఎత్తుగా బాగుంటే వారి ఆరోగ్యం బాగుంటుంది. వ్యాపారంలో బాగా సంపాదిస్తారు.

12. బుధస్థానం బాగుండి, బుధజాతకుల లక్షణాలు అన్నియు వీరికి బాగా ఉన్నట్లయితే వీరు వీరి తెలివితేటలతో మంచి సంపాదన గుర్తింపు పొందుతారు.

13. బుధజాతకులు నటులుగా. కళాకారులుగా, లాయర్లుగా కూడా రాణించగలరు.

14. బుధజాతకులకు దైవసహాయం ఉంటుంది. ఆకస్మిక ధనప్రాప్తి ఉంటుంది.

15. బుధజాతకులు ఎలాంటి కష్టనుండి అయినా బయట పడగలిగే అదృష్ట వంతులు.

16. బుధజాతకులుకు మంచి అలవాట్లు, మంచి స్నేహం, ఆహార నియమాలు అవసరం.

17. వీరు తలచుకొంటే వీరి తెలివితేటలతో ఎలాంటి పనినైనా సాధించుకోగల సమర్థులు.

# చంద్రస్థానము

అరచేతిలో చంద్రస్థానము చాలా బాగుంటే మంచిది. ఇలా ఉన్నప్పుడు వీరిని చంద్రజాతకులు అనవచ్చును. చంద్రజాతకులు చాలా గొప్ప అదృష్ట వంతులు. వీరికి భగవంతుని దయవల్ల మంచిమనసు, ప్రేమించేగుణము, మంచి ప్రవర్తన, తెలివి తేటలు, ఆలోచనాశక్తి, గ్రహణశక్తి, ఊహాశక్తి ఉంటాయి. వీరు వీరి తెలివితేటలతో బ్రతుకుతారు. కళాకారులుగా, వ్యాపారస్థులుగా బ్రతికే అవకాశం ఉంది. వీరు వీరి స్వస్థలం వదలి పరస్థానంలో జీవిస్తారు. పరస్థానమే వీరికి కలసివస్తుంది. పరుల సహాయం లభిస్తుంది. వీరికి వివాహ జీవితంలో సమస్యలున్నా జీవితంలో సుఖపడుతారు. వివాహవల్ల అదృష్టం కలసివస్తుంది. ఆకస్మిక ధనప్రాప్తి, అనుకోని అదృష్టం వీరికి చాలా లాభం చేస్తుంది. వీరి స్నేహం పొందగలిగిన వారు అదృష్ట వంతులు. వీరికి మంచి మనసు, ప్రేమించే గుణం ఉంటుంది.

1. చంద్రస్థానంలో ఒక నిలువురేఖ మంచి గ్రహణశక్తిని ఇస్తుంది.
2. చంద్రస్థానంలో అడ్డురేఖలుంటే చెడు ఫలితాలనిస్తుంది. ఆర్థిక, మానసిక ఇబ్బందులు వస్తాయి.
3. చంద్రస్థానంలో కత్తెరగుర్తు ఏర్పడి ఉంటే అనారోగ్యం, మూఢనమ్మకాలు తెల్పుతుంది.
4. చంద్రస్థానంలో త్రికోణము ఉన్నట్లయితే నీటిగండము, ప్రమాదములు సంభవించును.
5. చంద్రస్థానంలో నక్షత్రం గుర్తు ఏర్పడి ఉంటే అనారోగ్యము, అనుకోని ప్రమాదములు జరగవచ్చును.
6. చంద్రస్థానంలో త్రిభుజముగుర్తు ఉన్నట్లయితే ఆ వ్యక్తికి మంచి ఆలోచనా శక్తి, తెలివితేటలు, సూక్ష్మజ్ఞానం ఉంటాయి.



7. చంద్రస్థానంలో వృత్తము గుర్తు ఉన్నట్లయితే నీటి గండములు, ప్రమాద ముల వల్ల మరణం రావచ్చును.

8. చంద్రస్థానంలో చంద్రవంక గుర్తు ఉన్న యెడల చెడుకలలు వస్తాయి. పిచ్చి భయాందోళనలు ఏర్పడుతాయి.

## శుక్రస్థానం

శుక్రస్థానం బాగున్నట్లయితే ఆ జాతకుని శుక్రజాతకులుగా గుర్తించ వచ్చును. అరచేతిలో శుక్రస్థానం బాగుంటే వివాహం వల్ల స్థిరాస్థులు, సుఖజీవితం లభిస్తాయి. కుటుంబ జీవితం బాగుంటుంది. బంధువుల వల్ల లాభం పొందుతారు. మంచి సంతానం, సుఖసంతోషాలు లభిస్తాయి. సంసారజీవితంలో బాగా సుఖపడతారు. సంసారజీవితం హాయిగా గడుస్తుంది. డబ్బుకు లోటుండదు. మంచి విలాసవంతమైన జీవితం లభిస్తుంది. మీకు మంచి అలవాట్లు, మంచి స్నేహం అవసరం. ముఖ్యంగా బలహీనతలుండరాదు. శుక్రజాతకులు అదృష్టాన్ని నమ్మవచ్చును. అదృష్టం వీరిని ధనవంతులుగా మారుస్తుంది.

1. శుక్రస్థానంపై రెండు, మూడు నిలువురేఖలుంటే మోసపోతారు.
2. శుక్రస్థానంలో లంకగుర్తు ఏర్పడి ఉన్నచో వ్యభిచారము, చెడు అలవాట్లు, సూచించును.




3. శుక్రస్థానంపై నక్షత్రం గుర్తు ఉన్నచో కావలసిన ఆప్తులు మరణిస్తారు.
4. శుక్రస్థానంపై పుట్టుమచ్చ ఉంటే సుఖ వ్యాధులు వస్తాయి.
5. శుక్రస్థానంపై త్రిభుజం గుర్తు ఉన్నట్లయితే ప్రేమించిన వారి కొరకు డబ్బు నష్టపోతారు. ఆర్థిక ఇబ్బందులు ఎదుర్కొంటారు.
6. శుక్రస్థానంలో కత్తెరగుర్తు ఉన్నట్లయితే దాంపత్య జీవితంలో బాగా సుఖపడతారు. భార్యాభర్తలమధ్య మంచి ప్రేమానురాగా లుంటాయి.

7. శుక్రస్థానంపై చతురంగపాళి గుర్తుఉంటే వ్యభిచారము దురలవాట్ల వల్ల అనారోగ్యం, ధననష్టం జరుగును.
8. శుక్రస్థానంపై వృత్తము గుర్తు ఉన్నట్లయితే చెడువ్యాధులు రావచ్చును. దాంపత్య జీవితంలో సమస్యలు ఏర్పడుతాయి.
9. శుక్రస్థానంపై ఎక్కువగా అడ్డురేఖలుంటే మానసిక ఇబ్బందుల, టెన్షన్ ఉంటాయి. కుటుంబ జీవితం బాగుండదు.
10. రేఖాశాస్త్ర ప్రకారం చంద్రస్థానం, శుక్రస్థానం బాగున్నపుడే ఆ వ్యక్తికి సంతోషం, సుఖం, కుటుంబ జీవితం బాగుంటుంది. లేనట్లయితే మానసిక ఇబ్బందులు కలుగుతాయి.
11. శుక్రస్థానం బాగుంటే వివాహంవల్ల స్థిరాస్థులు, ధనము రావచ్చును.
12. శుక్రజాతకులకు ఇల్లరికం, ఇతరులకు పెంపకం వెళ్లటం వల్ల ధనవంతులు అయ్యే అదృష్టం ఉంటుంది.
13. శుక్రస్థానం బాగుంటేనే బంధువులు, పరుల సహాయం లభిస్తుంది.
14. శుక్రస్థానం బాగుంటేనే శాంతి, సుఖము ఉంటాయి.
15. ఈ శుక్రస్థానం బాగుంటేనే అదృష్టం బాగా కలసి వస్తుంది.

## మొదటి కుజ స్థానము

1. మొదటి కుజస్థానంలో ఒక నిలువు రేఖ ఏర్పడి ఉంటే ఆ వ్యక్తికి మంచి ధైర్య సాహసములుంటాయి. ఆ వ్యక్తి ప్రతీ విషయములలో ధైర్యంగా నిర్ణయాలు తీసుకొంటాడు.
2. ఎక్కువ నిలువు రేఖలుండటం వల్ల అవి బాగా లేనందులన ఆ వ్యక్తికి కోపం చాలా ఉంటుంది. తొందరపాటు ఉంటుంది. అందువల్ల తప్పుడు నిర్ణయాలు తీసుకొని కష్టములపాలవుతారు. వీరికి ఉబ్బసం వ్యాధి రావచ్చును.
3. కుజస్థానంలో అడ్డు రేఖలు ఎక్కువగా ఏర్పడి ఉంటే శత్రువుల వల్ల కష్టనష్టాలు ఎదుర్కొంటారు. కుజస్థానంలో ఏర్పడి ఉన్న ఈ అడ్డు రేఖలు బుధరేఖను ఖండించి నట్లయితే ఆ వ్యక్తికి వ్యాపారంలో నష్టం వస్తుంది.

4. మొదటి కుజస్థానంలో ఏర్పడి ఉన్న ఈ అడ్డు రేఖలు సూర్యరేఖను ఖండించినట్లయితే కీర్తి ప్రతిష్టలకు భంగం కలుగుతుంది.
5. మొదటి కుజస్థానంలో ఏర్పడి ఉన్న ఈ అడ్డు రేఖలు ధనరేఖను ఖండించి నట్లయితే ఆర్థికనష్టములు జరుగుతాయి.
6. మొదటి కుజస్థానం బాగుండి ఆ స్థానములో కత్తెర ఏర్పడి ఉన్నట్లయితే ఆ వ్యక్తి మొండి పట్టుదలకలవాడు అయి, పోట్లాటకుదిగి ఇతరులవల్ల అపాయములు ఎదుర్కొంటాడు.



7. కుజస్థానములో నక్షత్రం గుర్తు ఉన్నట్లయితే ఆ వ్యక్తి మిక్కిలి కోపము కలవాడై హత్యలు కూడా చేయవచ్చును.
8. కుజస్థానంలో చతురము గుర్తు ఉన్నట్లయితే కోపము ఉన్నా న్యాయమైన బుద్ధి కలవాడు అయి ఉంటాడు. న్యాయం కొరకు పాటుపడుతారు.
9. కుజస్థానంలో వృత్తము గుర్తు ఉన్నట్లయితే నేత్రములు అపాయములో పోవచ్చును. నేత్రరోగములు రావచ్చును.
10. రెండవ కుజస్థానంపై చతురంగపాళి గుర్తు ఉన్నట్లయితే కోపము, రాక్షస స్వభావము, మొండితనము ఉండవచ్చును.
11. కుజస్థానంలో త్రిభుజం గుర్తు ఉంటే ఆ వ్యక్తులు ఆటలలో మంచి పేరు, గుర్తింపు పొందగలరు.
12. కుజస్థానంలో పుట్టుమచ్చ ఉన్నట్లయితే గొడవలలో గాయములు, ప్రమాదములు జరిగే అవకాశం ఉంది.
13. మొదటి కుజస్థానంలో త్రిశూలం గుర్తు ఉన్నట్లయితే వీరికి ఎంత లభించినచూ తృప్తి పొందజాలరు.
14. కుజస్థానంలో చంద్రవంక గుర్తు ఉంటే మానసిక రోగములు వస్తాయి.

# రెండవ కుజస్థానము

1. మొదటి కుజాస్థానము ఫలితముతో రెండవ కుజస్థానము కూడా వర్తించును. అయితే మొదటి కుజస్థానం ఫలితములన్నియు మనసు గుణములకు వర్తిస్తాయి. రెండవ కుజస్థానం ఫలితాలన్నీ శరీరమునకు సంబంధించిన ఫలితాలనిస్తాయి.



2. మొదటి కుజస్థానం, రెండవ కుజస్థానం బాగుంటే ఆ వ్యక్తి మానసికంగా, శారీరకంగా ఆనందంగా, ఆరోగ్యంగా ఉంటాడు.
3. కుజ జాతకులు వ్యాపారాలలో, రాజకీయాలలో రాణించగలరు.
4. కుజ జాతకులు కోపము ఉన్నవారైనా నిజానికి వారిమనసు మంచిది. వారికి ఇష్టం అయిన వారికి సర్వం ఇవ్వటానికి వెనుకాడరు.



# అరచేతియందు ఉన్న గ్రహములయొక్క స్థానములు



# అరచేతులలో రకాలు

### 1. చతురముగా ఉండే చేయి దాని గుణములు :



చతురస్రాకారము చేతులు కలవారికి న్యాయమైన ఆలోచనలు, నీతినియమాలు, పద్ధతులు పాటించువారుగా ఉంటారు. వీరికి లౌకిక జ్ఞానం ఉంటుంది. ఇతరుల మనస్సు తెలుసుకొని ప్రవర్తిస్తారు. ఎన్నో రకాలుగా కష్ట పడి ప్రపంచ సుఖముల కొరకు కష్టపడుతారు. వీరికి దయ, జాలి, గుణములుంటాయి. ఓర్పుతో పనులను సాధించుకొంటారు. నచ్చని విషయములలో తల దూర్చరు. వీరికి చాలావరకు మంచి గుణములుంటాయి. వీరి జీవితం చాలావరకు బాగుంటుంది.

### 2. విస్తరించి ఉన్న చేయి :



ఈ చేతిలో వ్రేళ్ళు దూరం దూరంగా విశాలంగా ఉంటాయి. ఇలా ఉండటంవల్ల ఆ వ్యక్తు లకు స్వతంత్ర భావాలుంటాయి. ధైర్యంగా నిర్ణయాలు తీసుకొంటారు. చురుకుగా ఉంటారు. శ్రమచేస్తారు. క్రొత్త విషయాలు కనుక్కొంటారు. మంచి స్వభావం గుణము లుంటాయి. వీరు ప్రతీరోజు మార్పును కోరుకొంటారు. వీరు డబ్బు సంపాదనకు కీర్తి ప్రతిష్టల కొరకు చాలా శ్రమచేస్తారు. సాధి స్తారు. వీరు జీవితంలో బాగా అభివృద్ధిలోకి వస్తారు.

### 3. సామాన్య హస్తము :



ఈ సామాన్య హస్తములు పొట్టిగా ఉంటాయి. వ్రేళ్ళు చిన్నగా ఉంటాయి. వీరిది సామాన్యమైన జీవితం. నిలకడ లేని జీవితం గడుపుతారు. ఆదాయం, వృత్తి, జీవితం నిలకడగా ఉండదు. దారిలేని జీవితంలో అనేక కష్టాలు అనుభవిస్తారు. వీరికి ఎలాంటి నీతి నియమాలు, ఆశయాలు ఉండవు. వీరికి కుటుంబ జీవితంకూడా బాగుండదు. చెడు అలవాట్లు, చెడు స్నేహాలుంటాయి. వీరిది చాలా సామాన్యమైన జీవితం.

### 4. ఆధ్యాత్మిక హస్తము :

ఈ రకంగా చేతి వ్రేళ్లు ఆకారం ఉన్న చేతిని ఆధ్యాత్మిక హస్తం అని కూడా అంటారు. వ్రేళ్ళు సన్నగా, మాంసము లేకుండా వంగిపోయి ఉంటాయి. వ్రేలు వంకర తిరిగే చోటును "కణుపు" అంటారు. వ్రేళ్ళు కణుపులు ఉబికి, వ్రేళ్ళు వెనుక భాగం వంగి గోళ్ళు పొడవుగా ఉంటాయి. చేయి పొడవుగా వ్రేళ్ళు పొడవుగా కోణము ఆకారంలో ఉంటుంది. దీన్ని కణుపులు ఉబికిన హస్తం లేదా ఆధ్యాత్మిక హస్తం అంటారు. వీరికి దేవునిపై నమ్మకం, ఆధ్యాత్మిక చింతన ఎక్కువగా ఉంటాయి. ధర్మ గుణములు, న్యాయగుణము లుంటాయి. వీరు మామూలు జీవితం కంటే నవ్యాని జీవితమును ఎక్కువగా ఇష్టపడుతారు. నూతన విషయములు తెలుసుకొనుటకు ప్రయత్నిస్తారు. సంపాదన, సుఖంపై వీరికి కోరిక ఉండదు. వీరు ఇతరులకు సేవ చేస్తారు. సమాజానికి ఉపయోగపడు తారు. వీరికి ఎలాంటి స్వార్థం ఉండదు.



**5. కళా హస్తము :**



మామూలు పరిమాణము కలిగి వ్రేళ్ళు చివరికి రాను, రాను సన్నంగా ఉండి మొనదేరి ఉంటాయి. చేయి కూడా అదోరకంగా ఉంటుంది. ఇలాంటి చేయిని కళాహస్తము అంటాము. వీరికి మంచి గ్రహణ శక్తితోపాటు, భావోద్రేకము ఉంటుంది. వీరు లలితకళలలో మంచి పేరు సంపాదించుకొంటారు. వీరికి ఉదార స్వభావం ఉంటుంది. ఇతరులను ఆకర్షించ గల శక్తి ఉంటుంది. వీరు కళలలో పేరు సంపాదిస్తారు. నటులుగా, గాయకులుగా, చిత్రకారులుగా పేరు ప్రఖ్యాతులు సంపాదించుకొంటారు.

**6. మొనదేరిన హస్తము :**



దీనిని సాత్విక హస్తము అని కూడా అంటారు. వీరికి వ్రేళ్ళు సన్నగా, పొడవుగా, చాలా అందంగా ఉంటాయి. గోళ్ళుకూడా చాలా పొడవుగా ఉంటాయి. చేయి ఆకారం కూడా అందంగా, కోమలంగా ఉంటుంది వీరికి. వీరికి మంచి మనసు, మానసిక తత్వము, శాంతగుణము, దైవభక్తి ఉంటాయి. వీరు ఎప్పుడు ఆలోచనలలో మునిగి తేలుతుం టారు. ఏకాంతమును కోరుకొంటారు. ధ్యానము, సంగీతంఅందు అభిరుచి ఉంటుంది వీరికి. వీరికి మామూలు కోరికలు తక్కువ. వీరికి ప్రయత్నం చేస్తే దివ్యశక్తులు లభిస్తాయి. వీరు ఎక్కువగా ఏకాంతములో ఆలోచనలలో మునిగి ఉంటారు. వీరు ఎవరికైనా హాని చేయరు. మనసు నొప్పించరు. వీరికి భక్తి ఎక్కువ.

# గ్రహజాతకుల గురించి వివరములు

### *1. గురుజాతకుల గురించి :*

గురుజాతకులు ఎత్తుగా, లావుగా, మంచి గంభీరంగా ఆకర్షణీయంగా ఉంటారు. వీరి చేతిలో గురు వ్రేలు పొడవుగా, గురుస్థానం ఎత్తుగా బాగుంటుంది. గురుస్థానంపై మంచి గుర్తులు ఉంటాయి. దీనికి తోడు వీరు 3, 12, 21, 30 తేదీలలో పుట్టి ఉంటే, గురువారం రోజున పుట్టినచో వీరికి గురుబలం చాలా ఎక్కువగా ఉంటుంది. అందువల్ల వీరు మంచి విద్యావంతులు అయి, మంచి పొజిషన్‌లో ఉంటారు. బాగా సంపాదిస్తారు. కీర్తి, ప్రతిష్ఠలు సంపాదిస్తారు. అనుకొన్న పనులు సాధించుకొని తీరుతారు. వీరికి పట్టుదల, ఆత్మాభిమానం, ఎక్కువ. వీరు సమాజానికి సేవ చేస్తారు. బాగా గుర్తింపబడుతారు. వీరికి వివాహ జీవితం చాలా బాగుంటుంది. వీరి సంతానం బాగా అభివృద్ధిలోనికి వస్తారు. వీరు కీర్తి, ప్రతిష్ఠల కొరకు శ్రమ పడతారు. వీరికి మంచి గుణములు, మంచి ఆశయములు ఉంటాయి.

### *2. శనిజాతకుల గురించి :*

శనిజాతకులు సన్నగా, పొడవుగా, ఉండి ముఖము పాలిపోయినట్లు ఉంటారు. వీరికి ఆరోగ్యం అంతగా బాగుండదు. వీరికి అరచేయి పొడవుగా, వ్రేళ్ళు పొడవుగా ఉంటాయి. వీరికి అరచేతిలో శనిస్థానం బాగుండి, శనిస్థానం పైన మంచి గుర్తులు ఉంటే, వీరు 8, 17, 26 తేదీలలో జన్మించి, శనివారం పుట్టి ఉన్నట్లయితే మరీ మంచిది. వీరికి వివాహ జీవితం అంతగా కలసిరాదు. వీరికి దైవభక్తి ఎక్కువ. ఏకాంతంగా ఉండాలనుకుంటారు. సన్యాసులుగా మారే అవకాశం ఉంది. వీరు జ్యోతిష్యులుగా, మంత్రగాళ్ళుగా, రాజకీయ నాయకులుగా గుర్తింపు పొందగలరు. వీరికి ఆరోగ్యం అంతగా బాగుండదు. వీరికి వాక్కు బలం చాలాఎక్కువ. వీరి మాటలు నిజం అవుతాయి. వీరి అంచనలు ఫలిస్తాయి. వీరితో శతృత్వం మంచిది కాదు. వీరు చాలా వరకు ఎదుటి వారికి మేలు చేస్తారు. కాని కీడు చేయరు.

### 3. రవిజాతకుల గురించి :

రవిజాతకులు ఎత్తుగా, అందంగా, గంభీరంగా, మంచి ఆకర్షణీయంగా ఉంటారు. వీరికి అరచేతిలో రవివ్రేలు పొడవుగా ఉండి, రవిలో గుర్తులు, స్థానం బాగుండి, 1, 10, 19, 28 తేదీలలో, ఆదివారం నాడు పుట్టి ఉన్నట్లయితే వారికి సూర్య జాతకుల గుణముల అన్నీ వర్తిస్తాయి. వీరు మంచి విద్యావంతులు అవుతారు. మంచి ఉద్యోగములు చేస్తారు. పనికి విలువనిస్తారు. సరియైన మార్గంలో ప్రయాణం చేస్తారు. వారు చేస్తున్న పదవికి న్యాయం చేస్తారు. ఎక్కడ ఉన్నా నెంబర్‌వన్ స్థానంలో ఉంటారు. వీరు కృషిచేసి పైకి వస్తారు. ఉద్యోగస్థులుగా రాజకీయ నాయకులుగా రాణిస్తారు. అనుకొన్న, పెట్టుకొన్న పనులు పూర్తి చేస్తారు. ఓటమిని అంగీకరించరు. కీర్తిప్రతిష్ఠలు, పొందుతారు. డబ్బుకన్న మంచితనముకే విలువనిస్తారు. వీరికి కూడా దాంపత్య జీవితం బాగుంటుంది. మంచి సంతానం కలుగుతారు. మంచి అభివృద్ధి లోనికి వస్తారు. సోమరితనం వీరికి నచ్చదు. అనుకొన్న పనిని, కార్యమును చేసి తీరుతారు.

### 4. బుధజాతకుల గురించి :

బుధజాతకులు లావుగా, పొట్టిగా, ఉంటారు. వీరికి అరచేతిలో బుధుని వ్రేలు పొడవుగా ఉండి, బుధస్థానము బాగుండి, వీరు 5, 14, 23 తేదీలలో బుధవారం రోజు జన్మించి ఉన్నట్లయితే వీరికి బుధజాతకుల లక్షణాలు ఎక్కువగా వుంటాయి. వీరికి మాటకారితనము, తెలివితేటలు, చలాకీతనం ఎక్కువ. వీరికి వ్యాపారం కలసి వచ్చే వృత్తి. వ్యాపారంలో బాగా సంపాదిస్తారు. నష్టం వచ్చి మరల కోలుకొంటారు. వీరికి మంచి సంపాదన, స్థిరాస్థులుంటాయి. కుటుంబ జీవితం బాగుంటుంది. జీవితంలో సంపాదిస్తారు సుఖపడుతారు. వీరిలో మంచి లాయర్లు, నటులు, కళాకారులు కూడా ఉంటారు. వీరికి బ్యాంక్ ఉద్యోగాలు వచ్చే అవకాశం కూడా ఉంది. వీరు ఆహార నియమాలు పాటించాలి. ఆరోగ్యం అంతగా బాగుండదు. అజీర్ణ వ్యాధులు, చర్మ రోగములు వచ్చే అవకాశం ఉంది. వీరు దైవకార్యక్రమములు చేస్తారు. పుణ్యతీర్థాలు ధరిస్తారు. లాభంలేని పనిచేయరు. వీరికి లౌకికం ఎక్కువ. మంచి చేస్తారు కాని చెడు చేయరు. అనుమానం, అపనమ్మకం ఉంటుంది. అయిననూ గెలుపు వారిదే. సంపాదన, సుఖసంతోషాలు పొందుతారు, సుఖపడుతారు.

### 5. చంద్రస్థానం గురించి :

అరచేతిలో చంద్రస్థానం బాగుండి, చంద్రస్థానం పై మంచి గుర్తులు ఉండి, వీరు 2, 11, 20, 29 తేదీలలో సోమవారం పుట్టి ఉన్నట్లయితే వీరికి చాలా మంచి ఫలితాలు ఉంటాయి. చంద్రజాతకులు అందంగా, ఆకర్షణీయంగా చురుకుగా ఉంటారు. వీరికి మంచి మనసు, జాలి, ప్రేమ, దయ ప్రేమించే స్వభావం ఉంటుంది. వీరికి మంచి తెలివితేటలు, ఆలోచనాశక్తి, ఊహాశక్తి ఉంటాయి. వీరు వీరి తెలివితేటలతో బ్రతకగలరు. వీరికి ధైర్యం, పట్టుదల తక్కువ. ధైర్య చేస్తే, పట్టుదలగా పనిచేస్తే బాగా సంపాదించగలరు. వీరు ప్రేమిస్తారు. ప్రేమించబడుతారు. అయినా వీరి ప్రేమఫలిచటం కష్టం. ప్రేమలో అనేక కష్టములను ఎదుక్కొంటారు. సర్దుకు పోగలిగితే కుటుంబ జీవితం బాగుంటుంది. సంసారసుఖం బాగా అనుభవిస్తారు. వీరికి సెక్సు కోరికలు, బలహీనత లుంటాయి. ఆకస్మిక ధనప్రాప్తి, మంచి సంపాదన, సుఖసంతోషాలు అదృష్టం ఉంటుంది. చాలావరకు వీరి కోరికలు నెరవేరుతాయి.

### 6. శుక్రస్థానం గురించి :

అరచేతిలో బ్రొటనవ్రేలు పెద్దదిగా ఉండి, శుక్రస్థానం బాగుండి, శుక్రస్థానం పై వీరికి మంచి గుర్తులు ఉండి, వీరు 6, 15, 24 తీదీలలో శుక్రవారం పుట్టిఉంటే వీరికి శుక్రజాతకుల ఫలితాలు చాలా వరకు ఉంటాయి. వీరు చాలా అందంగా ఉంటారు. వీరి ఊహలు, కోరికలు అందంగా ఉంటాయి. శృంగారం, సుఖజీవితం కొరకు తాపత్రయ పడుతారు. సుఖపడుతారు. సుఖపడటం వీరి జన్మహక్కు. వీరు ఇతరులకు పెంపకం వెళ్ళడం ద్వారా, ఇల్లరికం, వివాహం వల్ల డబ్బు, స్థిరాస్థులు, అదృష్టం మంచి లైఫ్ పొందుతారు. శృంగారం, సుఖం, సెక్సు కోరికలు తీర్చుకొంటారు. వీరికి సంతానం కూడా మంచి అందమైన, అదృష్టవంతులైన సంతానం కలుగుతారు. సంతానం వల్ల కూడా బాగా కలసివస్తుంది. వీరికి వ్యాపారం, జూదం, లాటరీలు, పందాలు, స్పెక్యులేషన్ వల్ల సంపాదన, అదృష్టం కలసివస్తాయి. ధైర్యం చేస్తే వీరికి మంచి అదృష్టం, సంపాదన, సుఖం లభిస్తాయి. అయితే అలవాట్లవల్ల జీవితం పాడు అయ్యే అవకాశం ఉంటుంది. దురలవాట్లకు దూరంగా ఉండటం, మంచి స్నేహం అవసరం. వీరు సుఖపడ్డట్టు మరి ఎవరూ సుఖపడలేరు.

# కుజస్థానాల గురించి

అరచేతిలో కుజస్థానములు బాగుండి, కుజస్థానములపై మంచి గుర్తులు ఉండి వారు 9, 18, 27 తేదీలలో మంగళవారం పుట్టినట్లయితే వీరికి కుజజాతకులకు ఉండే లక్షణాలు అన్నీ ఉంటాయి. వీరు పొడవుగా, గంభీరంగా, ఆకర్షణీయంగా ఉంటారు. వీరికి కోపం, పట్టుదల, తొందరపాటు, టెన్షన్ ఎక్కువగా ఉంటాయి. అయినను జాలి గుణం ఉంటుంది. ఇతరులకు సహాయం చేస్తారు. వీరు స్వస్థలం వదలి పరస్థానంలో సెటిల్ అవుతారు. వీరికి పరస్థామే కలసివస్తుంది. వీరికి వ్యవసాయం, వ్యాపారాలు, రాజకీయాలలో సంపాదన, గుర్తింపు ఉంటుంది. మంచికి విలువనిస్తారు. మంచిపనులు చేస్తారు. నమ్మి మోసపోతుంటారు. వీరికి వివాహంవల్ల స్థిరాస్థులు వస్తాయి. వివాహజీవితం తృప్తిగా ఉండదు. రాజీపడి బ్రతకవలసి వస్తుంది. రాజీ పడగలిగితేనే వివాహ జీవితం సాగుతుంది. వీరికి రెండవవివాహం జరిగే అవకాశం, పరులతో సంబంధాలు ఏర్పడే అవకాశం ఉంటుంది. ఆర్థిక ఇబ్బందులు, మానసిక ఇబ్బందులు ఎదుర్కొంటారు. పట్టువిడుపులుంటే, రాజీపడగలిగితే జీవితం హాయిగా గడుస్తుంది. లేని పక్షంలో సమస్యలు, టెన్షన్ తప్పదు. వీరు అవసరం అనుకొన్నప్పుడు రాజీపడటమే మంచిది. వీరి సంతానం కూడా అభివృద్ధిలోకి వస్తారు. స్వంత మనుషులకన్నా బయటి వారితోనే వీరికి లాభం కలుగవచ్చును.

అరచేయి రంగు, గ్రహబలాలు, రేఖలు బాగున్నట్లయితే చాలా మంచి ఫలితా లుంటాయి. జాగ్రత్తగా పరిశీలించి నిర్ణయాలు చేయాలి.

### అరచేయి

అరచేయి అందంగా, మంచిరంగు కలిగి, గ్రహస్థానములు బాగుండి, రేఖలు స్పష్టముగా, కాంతివంతంగా ఉంటే అవి చాలా మంచి ఫలితాలనిస్తాయి. అరచేయి రాయిలాగా ఉండకుండా మెత్తగా ఉంటే చాలామంచిది. అదృష్టం కలసివస్తుంది.

అరచేయి మధ్యభాగంలో వ్రేలితో నొక్కిచూస్తే ఆ భాగం మెత్తగా, మృదువుగా ఉంటే ఆ వ్యక్తికి జాలి దయ ప్రేమగుణాలుంటాయి. ఆ భాగం

రాయిలాగా గట్టిగా ఉంటే ఆ వ్యక్తికి ప్రేమ, జాలి, దయ ఉండదు. మనసు కూడా రాయిలాగా ఉంటుంది.

ఈ అరచేయి మధ్యభాగం లోతుగా, గుంటగా ఉండరాదు. గుంటగా ఉంటే ఆ వ్యక్తి ఆర్థిక నష్టములు ఎదుర్కొంటాడు. అరచేయి మధ్యభాగం ఎత్తుగా ఉంటే ఆదాయం సుఖసంతోషాలుంటాయి.

అరచేయి రంగు బాగుండి, అరచేయిలోని రేఖలు స్పష్టంగా, లోతుగా, కాంతి వంతంగా ఉంటే మంచి ఫలితాలనిస్తాయి.

అరచేయిలోని రేఖలు అస్పష్టంగా, మోటుగా, కాంతిహీనంగా, ఉంటే చెడు ఫలితాలు కలుగుతాయి. రేఖలపై, గ్రహస్థానములపై నిలువురేఖలుంటే మంచి జరుగుతుంది. అడ్డురేఖలు, చెడు గుర్తులుంటే చెడుఫలితాలు కలుగుతాయి. సాధారణంగా నిలువు రేఖలు మంచి ఫలితాలనిస్తాయి. చెడురేఖలు, అడ్డు రేఖలు చెడు ఫలితాలనిస్తాయి.

అరచేతిలో తక్కువ రేఖలున్నవారికి సాధారణ జీవితం ఉంటుంది. ఎక్కువ రేఖలుంటే మంచి ప్రఖ్యాతిగల జీవితం గౌరవం, పలుకుబడి ఉంటాయి. పురుషులకు కుడిచేయి, స్త్రీలకు ఎడమచేయి చూడాలి.

అరచేతిలోని రేఖలు ఎంత స్పష్టంగా ఉంటే అంత మంచిది. అరచేతిలోని జీవిత రేఖలనుండి వచ్చే నిలువు రేఖలు సంపాదన, స్వంత ప్రయత్నములు గురించి, బుద్ధి రేఖలోనుండి వచ్చే నిలువు రేఖలు ధైర్యసాహసముల గురించి తెలుపును. ఆత్మరేఖనుండి వచ్చు నిలువు రేఖలు ప్రేమజీవితం గురించి తెలుపుతాయి. అదృష్ట రేఖనుండి వచ్చు నిలువు రేఖలు ధనసంపాదన, విజయముల గురించి తెలుపుతాయి. సూర్యరేఖనుండి వచ్చు నిలువు రేఖలు కీర్తి ప్రతిష్టల గురించి తెలుపుతాయి. బుధ రేఖనుండి వచ్చిన నిలువు రేఖలు ఆరోగ్యం, వ్యాపారంలో సంపాదన గురించి తెలుపుతాయి.

శుక్రస్థానము నుండి ఏర్పడిన నిలువురేఖలు బంధువులకు సంభంధించిన విషయాలు తెలుపుతాయి. చంద్రస్థానంనుండి వచ్చిన నిలువు రేకలు పరస్థానం, పరుల గురించి తెలుపును. కుజస్థానం నుండి వచ్చిన నిలువు రేఖలు ధైర్యసాహసముల గురించి తెలుపును. బుధస్థానమున ఏర్పడిన నిలువు రేఖలు వ్యాపారం, ఆరోగ్యం గురించి తెలుపును. సూర్యస్థానమున ఏర్పడిన నిలువు రేఖలు విద్య,

కీర్తిప్రతిష్టల గురించి తెలుపును. శనిస్థానమునుండి వచ్చిన నిలువు రేఖలు ధన సంపాదన, గురుస్థానం నుండి వచ్చిన నిలువు రేఖలు అధికారం, అభివృద్ధి గురించి తెలుపును. ఈ విషయములు చాలా ముఖ్యమైనవి.

సామాన్యంగా పురుషులకు కుడి చేతులు, స్త్రీలకు ఎడమ చేతులు చూడాలి. అయితే ముఖ్యమైన విషయముల గురించి నిర్ణయించేటపుడు రెండు చేతులు చూసి గ్రహస్థానముల బలాబలాలను పరీక్షించి ఫలితముల గురించి ఒక నిర్ణయానికి రావాలి. అరచేయి బాగుండటం వల్ల, గ్రహస్థానాలు బాగుండటం వల్ల, రేఖలు స్పష్టంగా ఉండటం వల్ల చాలా మంచి ఫలితాలుంటాయి. విరిగిన రేఖలు, నీచముగా ఉన్న గ్రహస్థానములు చెడు ఫలితాలనిస్తాయి.



1. వ్రేళ్ళు    2. అరచేయి    3. చేయి    4. అన్ని వేళ్ళకు మూడు పర్వాలుంటాయి. మొదటి పర్వము, రెండవ పర్వము, మూడవ పర్వము.

5. బ్రొటన వ్రేలుకు మాత్రం రెండు పర్వాలే ఉంటాయి.

## మంచి అదృష్టవంతుని హస్తము



# అరచేతిలోని రేఖలు

**1. జీవిత రేఖ :** ఇది వ్యక్తి జీవితం గురించి, ఆరోగ్యం గురించి ఆ వ్యక్తి అభివృద్ధి గురించి, ఆయుష్షు పరిమాణం గురించి తెలుపుతుంది. అందుకే దీనిని జీవిత రేఖ లేదా ఆయుష్య రేఖ అని అంటున్నాము.



జీవితరేఖ గురుస్థానం క్రింద, రెండవ కుజస్థానం మధ్యలో ప్రారంభం అయి అరచేయి మధ్యభాగం గుండా ప్రయాణంచేస్తూ బయలు దేరి అరచేయి అడుగు భాగంలో కాని కొందరికి మధ్యలోనే నిలచిపోయే ఈ రేఖను జీవిత రేఖ లేదా ఆయుష్షు రేఖ అని పిలుస్తున్నాము.

## జీవితరేఖ

గురుస్థానము, రెండవ కుజస్థానముల మధ్య అరచేయి అంచునుండి ప్రారంభం అయి అరచేయి మధ్యభాగం నుండి కంకణరేఖల వరకు వచ్చి ఆగిపోవు ఈ రేఖను సంపూర్ణ జీవితరేఖ, (ఆయుష్యరేఖ) అని అంటాము. ఇది కొందరి చేతులలో ఇలా పూర్తిగా ఉంటుంది. ఇలా పూర్తిగా ఉంటే ఆ వ్యక్తి ఎక్కువ కాలం జీవిస్తాడు. ఆరోగ్యం, అభివృద్ధి చాలా బాగుంటుంది.

కాని కొందరి చేతులలో ఈ రేఖ మధ్యభాగంలోనే ఆగిపోతుంది. అలా ఆగిపోవటం మంచిదికాదు. వీరికి ఆయుష్షు తక్కువగా ఉంటుంది. జీవితరేఖపై అడ్డు రేఖలుంటే ప్రమాదములు జరగవచ్చును.

ఈ జీవితరేఖ సంపూర్ణముగా, స్పష్టంగా, లోతుగా కాంతివంతంగా, అందంగా, ఉంటే ఆ వ్యక్తికి ఆరోగ్యం బాగుంటుంది. అతడు ఎక్కువకాలం జీవిస్తాడు. ఆదాయం, సుఖసంతోషాలు, మంచి అభివృద్ధి ఉంటుంది.

ఈ జీవితరూఖపై మచ్చలు, డాగులు, అడ్డురేఖలు, గుంటలు, లంకలు, చెడు గుర్తులున్నట్లయితే ఆ వ్యక్తికి ఆరోగ్యం బాగుండదు. అనేక కష్టములు, నష్టములు, సమస్యలు వస్తాయి. దురదృష్టవంతుల చేతులలో రేఖలు చిన్నవి, అసహ్యంగా, అడ్డురేఖలతో ఉంటాయి. అందువల్లే వారు అనేక కష్టనష్టములను ఎదుర్కొంటూ ఉంటారు. వారికి అనారోగ్యం, ఆర్థిక నష్టములు, నిలకడలేని జీవితం, నేలకడలేని ఆదాయంతో కష్టాలు పడుతూ ఉంటారు.

ఈ జీవిత రేఖ చాలా ముఖ్యమైన రేఖ. ఇది బాగుంటేనే వ్యక్తి జీవితం చాలా బాగుంటుంది. ఈ జీవితరేఖ లేని వ్యక్తి అంటూ ఎవరూ ఉండరు. ఈ జీవితరేఖ అరచేతిలో కన్పించకపోతే ఆ వ్యక్తి చిన్న వయస్సులోనే మరణించే ప్రమాదం ఉంది.

అపుడే పుట్టిన పిల్లవాడి చేతిలో కూడా రేఖలు ఉంటాయి. అయితే కొందరి చేతులలో చాలా రేఖలుంటాయి. వారు చాలా ప్రఖ్యాతిగల జీవితం పొందుతారు. కొందరి చేతులలో రెండు, మూడు రేఖలుంటాయి. వారిది మాత్రం చాలా సామాన్య జీవితం. సామాన్యంగా చాలామంది వ్యక్తుల చేతులలో మూడు రేఖలు కన్పిస్తాయి.

## జీవితరేఖ

1. కుజస్థానమును, శుక్రస్థానమును పూర్తిగా చుట్టి, స్పష్టంగా, లోతుగా, కాంతివంతంగా జీవితరేఖ ఉన్నట్లయితే ఆ వ్యక్తి మంచి చురుకుదనము గలిగి, మంచి ఆరోగ్యవంతుడు అయి మంచి సంపాదనతో సుఖశాంతులు అనుభవిస్తాడు.



2. ఈ జీవితరేఖ సన్నగా, లోతుగా, కాంతి వంతంగా ఉండి ఎలాంటి అడ్డురేఖలు లేకుంటే ఆ వ్యక్తి జీవితంలో చాలా తొందరగా మంచి అభివృద్ధి పొందు తాడు. వీరు జీవితంలో అనుకొన్నవి సాధించుకొని తీరుతారు.
3. కొందరి చేతులలో ఈ జీవితరేఖ చాలా వెడల్పుగా, మోటుగా కన్పిస్తుంది. కాంతివంతంగా ఉండదు. పాలిపోయి నట్లు ఉంటుంది. ఇలా ఉంటే వీరికి పశుబలం ఉంటుంది. ఆదాయం పెద్దగా ఉండదు. కూలీపని చేస్తు జీవిస్తారు. ఆర్థిక ఇబ్బందులు ఎదుర్కొంటారు.
4. జీవితరేఖ సన్నగా ఉంటే అనారోగ్యాలు తొందరగా వస్తాయి. తొందరగా పోతాయి.
5. కాని జీవితరేఖ వెడల్పుగా, మోటుగా ఉంటే అనారోగ్యాలు తొందరగా రావు. కాని వస్తే తొందరగా వదలవు. మనిషిని పట్టిపీడిస్తాయి.

6. జీవితరేఖ ఒకచోట సన్నగా, కొన్ని చోట్ల వెడల్పుగా, మచ్చలు, అడ్డురేఖలతో ఉన్నట్లయితే ఆ వ్యక్తి అనారోగ్యం, చెడుగుణములు, అర్థిక ఇబ్బందులు ఉంటాయి. వీరి జీవితం హాయిగా గడవదు. అనేక కష్టములను ఎదుర్కొంటారు.
7. ఈ జీవితరేఖ గొలుసులాగా ఏర్పడి ఉంటే అనారోగ్యం, నిలకడలేని జీవితం, చెడు అలవాట్లు ఏర్పడుతాయి.
8. ఈ జీవితరేఖ ముక్కలు ముక్కలుగా ఏర్పడిఉంటే తరచూ అనారోగ్యం, వృత్తిలో మార్పులు, అర్థిక ఇబ్బందులు ఎదుర్కొంటారు.
9. జీవితరేఖ రెండు చేతులలో కూడా ముక్కలు అయితే తొందరగా మరణం రావచ్చును.
10. జీవితరేఖ విరిగిపోయినట్లు ఉంటే ఆ వయస్సులో అతనికి ప్రమాదం జరుగుతుంది. రెండు చేతులలో అలాగే విరిగిపోయినట్లు ఉన్నట్లయితే మరణం రావచ్చును.
11. అరచేతిలో జీవితరేఖ ముక్కలుగా అయిననూ ఒకదాని మీద ఒకటి ఎక్కి ఉన్నట్లయితే లేదా అక్కడ చతురము గుర్తు ఏర్పడి ఉన్నట్లయితే అతనికి ఆ ప్రమాదం తప్పిపోవును.
12. జీవితరేఖ అరచేతిలో విరిగిపోయి ఉంటే అదృష్టరేఖ ఆ రేఖతో కలసిపోయి నట్లయితే అతడు కేవలం అదృష్టంవల్ల ప్రమాదం నుండి బయటపడగలుగు తాడు.
13. జీవితరేఖ చిన్నచిన్న ముక్కలుగా ఏర్పడి ఉన్నట్లయితే ఆ వ్యక్తికి అనారోగ్యం, అర్థిక ఇబ్బందులు, చిన్న వయస్సులోనే మరణం రావచ్చును.
14. ఈ జీవితరేఖ శుక్రస్థానములోనికి పోయి ఏర్పడి ఉన్నట్లయితే ఆరేఖ వైశాల్యం తగ్గుతుంది కాబట్టి ఆ వ్యక్తి ఎక్కువ కాలం జీవించే అవకాశం లేదు.
15. గురుస్థానం దగ్గరనుండి జీవితరేఖ ప్రారంభం అయి ఉంటే ఆ వ్యక్తికి మంచి ఆలోచనలు, మంచి ఆశయములు ఉండి మంచి అభివృద్ధి సాధించుకొనును.
16. ఈ జీవితరేఖ చంద్రస్థానంలోనికి చొచ్చుకుపోయి పూర్తిగా ఉన్న ఎడల ఆ

వ్యక్తికి ఎక్కువ కాలం జీవించే అవకాశం ఉంటుంది. వీరికి సెక్సుకోరికలు ఎక్కువగా ఉంటాయి.

17. ఈ జీవితరేఖ సామాన్యంగా బుద్ధిరేఖతో కలసి ఉంటుంది ప్రారంభంలో. అలా కలసి ఉండటంవల్ల నిదానము, ఓర్పు ఉంటాయి.

18. కాని కొందరి చేతులలో ఈ జీవితరేఖ బుద్ధి రేఖకు దూరంగా ప్రారంభం అయి ఏర్పడి ఉంటుంది. ఇలా ఉండటంవల్ల కొంతమంచిదే అయినా వారి తొందర పాటు వల్ల జీవితంలో చాలా కష్టాలు ఎదుర్కొంటారు. భార్యభర్తలు విడిపోయే ప్రమాదం ఉంటుంది. అభిప్రాయ బేధాలు, కలహాలు ఏర్పడుతాయి.

19. జీవితరేఖ, బుద్ధిరేఖ చాలా దూరం, దూరంగా విడిపోయి ఉంటే భార్యాభర్తల మధ్య అభిప్రాయబేధాలు వస్తాయి. విడిపోయే ప్రమాదం ఉంటుంది.

20. ఈ జీవితరేఖను, బుద్ధిరేఖను కలుపుతూ చిన్న, చిన్న రేఖలు ఉంటే ప్రతీ రోజు భార్యాభర్తలు గొడవపడ్డనూ కలసియే ఉంటారు విడిపోరు.

21. భార్యాభర్తలు ఇరువురి చేతులలో రేఖలు ఇలాగే విడిపోయి ఉంటే వారి మధ్య సంతోషము, సుఖము, శాంతి ఉండదు.

22. జీవితరేఖ ప్రారంభం అయిన చోట రెండు పాయలుగా చీలి ఉంటే ఆ వ్యక్తికి మంచి న్యాయమైన బుద్ధి, మంచి ఆలోచన, మంచి మనసు ఉంటుంది.

23. ఈ జీవితరేఖ బుద్ధిరేఖ ప్రారంభంలో విడి, విడిగా ఉంటే వారికి తొందరపాటు, ధైర్యం ఎక్కువగా ఉంటుంది.

24. ఈ జీవితరేఖ, బుద్ధిరేఖ చాలా దూరం కలసి ఉన్నట్లయితే ఆ వ్యక్తికి పిరికితనం, సోమరితనం ఏర్పడతాయి. తొందరపడి ఏ నిర్ణయాలు తీసుకోలేరు. అందువల్ల వీరు జీవితంలో తొందరగా పైకిరాలేరు.

25. జీవితరేఖనుండి ఒక నిలువురేఖ బయలుదేరి గురుస్థానం చేరి ఉన్నట్లయితే ఆ వ్యక్తికి మంచి గౌరవము, పలుకుబడి, అధికారం, సంపాదన, పేరుప్రతిష్ఠలు లభిస్తాయి.

26. ఈ నిలువురేఖను ఏదైనా చిన్న అడ్డురేఖ ఖండించి ఉన్నట్లయితే పై అన్నియు ఉండి మరల పోవును.

27. జీవితరేఖనుండి పైకి చిన్నచిన్న కడ్డీలు లేచి ఉంటే ఆ వ్యక్తికి మంచి సంపాదన, చేయు పనులలో లాభం ఉంటుంది.
28. ఈ చిన్న రేఖలు బుద్ధిరేఖను తాకి ఉన్నట్లయితే కోర్టు గొడవలు వస్తాయి.
29. ఈ జీవితరేఖనుండి పైకివచ్చిన నిలువురేఖలను మరల చిన్న చిన్న రేఖలు ఖండించినట్లయితే ఆ వ్యక్తికి ధననష్టము, చేయు వృత్తిలో సమస్యలు, మార్పులు వస్తాయి.
30. రేఖలను ఖండిస్తూ ఇతర రేఖలు ఉండటం వల్ల నష్టం, ప్రమాదం జరుగుతుంది.
31. అరచేతిలో జీవితరేఖ మధ్యలోనే ఆగిపోతే ఆ వ్యక్తికి ఆయుష్షు తక్కువగా ఉంటుంది.
32. రెండు చేతులలో ఆయుష్షురేఖ మధ్యలో ఆగిపోయి ఉంటే ఆ వయస్సులో మరణం సంభవించవచ్చును.
33. అలా మధ్యలో ఆగిపోయిన జీవితరేఖ వద్ద పుట్టుమచ్చ ఉంటే ఆ వ్యక్తి విష ప్రయోగం వల్ల మరణించవచ్చు.
34. అరచేతిలో ఏ రేఖలు కూడా చిన్న, చిన్నవిగా, అడ్డురేఖలు కలిగి ఉండటం మంచిదికాదు. చిన్న చిన్న రేఖలు ఎప్పుడునూ చెడు ఫలితాలనే ఇస్తుంది.
35. ఆయుష్యరేఖ క్రింది భాగంలో రెండు పాయలుగా చీలి ఉంటే ఆ వ్యక్తి చివరిదశలో అనారోగ్యంతో బాధపడును.
36. అరచేతిలో ఉన్న ఈ ఆయుష్యరేఖకు నిలువురేఖలు ఉంటే ఆ వ్యక్తికి ఆరోగ్యము, సంపాదన, వృత్తిలో లాభం ఉంటుంది.
37. కాని ఈ జీవితరేఖకు రెండు వైపుల క్రిందికి వంగియున్న రేఖలు ఏర్పడి ఉండటం చాలా ప్రమాదం. ఇలా ఏర్పడిఉంటే ఆ వ్యక్తికి అనారోగ్యం, ధననష్టములు, వృత్తిలో కష్టాలు జరుగును. ఏపని చేసిననూ కలసిరాదు. ఆర్థిక ఇబ్బందులు, మానసిక ఇబ్బందులు కలుగును.
38. ఈ ఆయుష్షు రేఖకు ఇరువైపుల నిలువురేఖలుంటే ఆ వ్యక్తి మంచి ఆరోగ్యము, సంపాదన, వృత్తిలో లాభం, మంచి అభివృద్ధి ఉంటుంది.
39. ఈ ఆయుష్షురేఖ, బుద్ధిరేఖ ఎక్కువ దూరం కలిసి ఉన్నట్లుఉంటే ఆ వ్యక్తి పిరికితనం వల్ల, తెగింపు లేకపోవటంవల్ల జీవితంలో అభివృద్ధికి ఆలస్యం జరుగును.

40. కొందరి చేతులలో జీవితరేఖ, బుద్ధిరేఖ, మరియు ఆత్మరేఖ కలసి ఒకే చోటనుండి వచ్చినట్లు ఉంటుంది. ఇలా ఉండ ‿ం చాలా ప్రమాదం. వీరికి ప్రమాదం వల్ల మరణం సంభవించవచ్చును.

41. జీవితరేఖలో నుండి అదృష్టరేఖ బయలుదేరి శనిస్థానం చేరి ఉన్నట్లయితే ఆ జాతకుడు తన స్వంత తెలివితేటలతో, స్వంతకృషితో అభివృద్ధి సాధించు కొంటాడు. ఇతరుల సహాయం ఆధారపడడు.

42. ఈ అదృష్టరేఖ మణికంకణ రేఖలనుండి ప్రారంభం అయి జీవిత రేఖను తాకి మరల ప్రయాణం చేసి శనిస్థానం చేరినట్లయితే చిన్నప్పుడు కొంతకాలం తండ్రి దగ్గర లాభం పొందినను అటు తర్వాత తన స్వయంకృషి తెలివితేటలు, ధైర్యసాహసాలతో అభివృద్ధి పొందుతాడు.

43. సూర్యరేఖ ఈ జీవిత రేఖనుండి ప్రారంభం అయి ఉన్నట్లయితే ఆ వ్యక్తి స్వయం కృషితోనే మంచి విద్యావంతుడు అయి ధనమూ కీర్తి ప్రతిష్ఠలు సంపాదించు కొంటాడు.

44. బుధరేఖకూడా ఈ జీవితరేఖనుండియే ప్రారంభం అయి ఉన్నట్లయితే ఆ వ్యక్తి స్వయంకృషితో, స్వంత తెలివితేటలతో వ్యాపారాలు చేసి బాగా సంపాదిస్తాడు. సుఖపడతాడు. వీరికి ఆరోగ్యం కూడా బాగుంటుంది.

45. ఆయుష్షురేఖను చిన్నచిన్న రేఖలు ఖండిస్తున్నట్లు ఉంటే ఆ కాలంలో చిన్న, చిన్న అనారోగ్యములు ఏర్పడును.

46. జీవితరేఖపై లంక గుర్తు ఏర్పడి ఉన్నచో ఆ వ్యక్తికి అజీర్ణవ్యాధులు, ఆర్థిక నష్టములు వచ్చును. స్త్రీలకైతే ప్రసవ సమయంలో మిక్కిలి బాధ కలుగును.

47. ఈ జీవితరేఖపై వృత్తము గుర్తు ఉన్నచో ఆ వ్యక్తికి కంటి జబ్బులు రావచ్చును. కళ్ళుపోయే ప్రమాదం ఉంటుంది.

48. ఈ జీవితరేఖపై త్రికోణం గుర్తు ఉంటే ఆ వ్యక్తి ఇతరులను మోసంచేసి బ్రతికే అవకాశం ఉంటుంది.

49. ఈ జీవితరేఖ ఎంత స్పష్టంగా దీర్ఘంగా ఉంటే అంత మంచి ఫలితాలుంటాయి. ఉండాలి.

50. ఈ జీవితరేఖ బాగాలేకుంటే ఆ వ్యక్తి ఎన్నో ఆపదలు కష్టనష్టాలు అనుభవిస్తారు.

# బుద్ధిరేఖ



బుద్ధిరేఖ లేదా శీర్షరేఖ అంటారు. ఇది గురుస్థానం క్రింద, రెండవ కుజస్థానం పైన ప్రారంభం అయి మొదట కుజస్తానం వద్దకాని, చంద్రస్థానం వద్దకాని ఆగిపోయి ఉంటుంది.

## బుద్ధిరేఖ (శిరోరేఖ)

ఈ బుద్ధిరేఖ గురుస్థానం క్రింద, జీవితరేఖ దగ్గరనుండి ప్రారంభం అయి చంద్రస్థానంలోనికి వచ్చి నిలచిపోతుంది. అయితే ఈ బుద్ధిరేఖ కూడా లేనివారు ఎవరూ ఉండరు.



కొందరి చేతులలో ఈ బుద్ధిరేఖ చాలాచిన్నదిగా ఉంటుంది. ఇలా ఉండడం మంచిదికాదు. ఇలా ఉంటే ఆ వ్యక్తికి నిలకడఉండదు. ఈరోజు గడిస్తేచాలు అనుకొంటాడు కాని రేపటిగురించి ఆలోచించడు. ఈ వ్యక్తికి సరియైన ఆలోచనలు, నిర్ణయాలు ఉండవు. అందువల్ల జీవితంలో అభివృద్ధి ఉండదు. సామాన్యమైన జీవితం, పొందుతారు. సోమరితనం, అశ్రద్ధ, కోపం ఎక్కువగా ఉంటాయి. గమ్యం లేని జీవితం వీరిది.



బుద్ధిరేఖ సన్నగా, లోతుగా, పొడవుగా ఇలా అరచేయి అంచువరకు చేరి ఉంటే చాలా మంచిది. ఇలా పొడవుగా బుద్ధిరేఖ ఉన్నవారు మంచి ఆలోచనలు చేస్తారు. మంచి అలవాట్లు ఉంటాయి. ప్రతీపనిని భవిష్యత్తును దృష్టిలో ఉంచుకొని నిర్ణయాలు తీసుకుంటారు. వీరికి మంచి తెలివితేటలుంటాయి. ఇతరులను సలహా అడగవలసిన అవసరం లేదు వీరికి. స్వయంగా నిర్ణయాలు చేయగలరు. వీరికి మంచి ఆదాయం, అదృష్టం ఉంటాయి. ఇతరులకు మంచి సలహాలు ఇవ్వగలుగుతారు. మంచి చేస్తారు వీరికి మంచి లక్షణాలు ఎక్కువగా ఉంటాయి. ఈ రేఖ పొడవుగా, సన్నగా లోతుగా ఉంటేనే మంచిది.

ఈ బుద్ధిరేఖ జీవితరేఖను తాకి ప్రారంభం అయి కొద్దిగా వంపుతేరి చంద్ర స్థానం లోనికి వచ్చి ఆగిపోయి ఉంటే చాలా మంచిది. అసలు బుద్ధిరేఖ ఉండవలసిన పద్ధతి ఇదియే. ఇలా ఉన్నవారికి మంచి మనసు, మంచి ఆలోచనాశక్తి, మంచి తెలివి తేటలు, గ్రహణశక్తి ఉంటాయి. వీరు బాగా ఆలోచించగలరు. మంచి నిర్ణయాలు తీసుకొం టారు. జీవితంలో మంచి అభివృద్ధి పొందు



తారు. నలుగురికి సహాయపడ గలరు. మంచి అలవాట్లు ఉంటాయి వీరికి. వీరికి వీరి తెలివితేటలే పెట్టుబడి. వీరికి ఉన్న తెలివి తేటలతో బ్రతికగలరు. వీరికి బుద్ధిబలం ఎక్కువ. వీరు తలచుకొంటే ఏ పనినైనా చేయగలరు.

కొందరి చేతులలో ఈ బుద్ధిరేఖ పూర్తిగా చంద్రస్థానంలోనికి దిగిపోయి ఉంటుంది. ఇలా ఉండటం అంత మంచిదికాదు. వీరికి మంచి ఆలోచనా శక్తి ఉంటుంది కాని అతిగా, లోతుగా, సున్నితంగా, ఎక్కువగా ప్రతీ విషయా నికి ఆలోచించి మనసు పాడుచేసుకొంటారు. బాధపడతారు. చిన్న, చిన్న విషయాలకు గూడా ఎక్కువగా ఆలోచించి విచారపడ్తారు. కష్టంవస్తే తట్టుకోలేరు. బాధలు వస్తే చనిపోదాము అనుకొంటారు. అందరినీ విడిచి దూరంగా



పోదామనుకుంటారు. ఆత్మహత్య చేసుకోవటానికి కూడా సిద్ధపడ్తారు. వీరికి సంసారజీవితం కూడా హాయిగా ఉండదు. దంపతులు విడిపోయే ప్రమాదం ఉంది. విడిపోవచ్చును. వీరికి అదృష్టం పెద్దగా లాభం చేయదు. అందువల్ల ఈ విధంగా బుద్ధిరేఖ ఉండటం మంచిది కాదు.



కొందరి చేతులలో ఈ బుద్ధిరేఖ జీవితరేఖతో కలసి చాల దూరంవరకు కలసి పోయి ఉంటుంది. ఇలా ఉండటం మంచిదికాదు. సామాన్యంగా ఇలా ఉండటం వల్ల ఆ వ్యక్తి పిరికివాడు అయ్యే అవకాశం ఉంది. తొందరగా, ధైర్యం చేసి నిర్ణయాలు తీసుకో లేడు. ఆలోచించి, ఆలోచించి సమయం వృధా చేసుకొంటాడు. ముందడుగు వేయలేడు. అధైర్యం, అపనమ్మకం, పిరికిత నంతో ఏ పనిచేయ లేడు. ఏపనిని ప్రారంభించ లేడు. పనిని ప్రారంభించినను ఏ చిన్న సమస్య వచ్చిననూ ఆ పనిని మధ్యలోనే వదలివేస్తారు. వీరు ఇతరుల సలహాలపై ఆధారపడ్తారు. ఇతరులు ధైర్యం చెప్పి అనుమానం, పిరికి తనం వల్ల పనులు చేయలేరు. అందువల్ల ఆర్థిక, మానసిక ఇబ్బందులు ఎర్కొంటారు.



కొందరి చేతులలో ఈ బుద్ధిరేఖ ప్రారంభంలోనే జీవితరేఖతో కలసీకలవ నట్లు ఉంటుంది. ఇలా ఉండటం చాలా మంచిది. ఇలా ఉండటం వల్ల ఆ వ్యక్తికి ధైర్యం, తొందరపాటు, ఆత్మవిశ్వాసం, పట్టుదల ఉంటాయి. ఆ వ్యక్తి స్వయంగా ఆలోచిస్తాడు. స్వయంగా నిర్ణయాలు తీసుకొంటాడు. ఆలోచన రావటమే నిర్ణయం తీసుకొంటారు. పనిని వెంటనే ప్రారంభిస్తారు. ఆలోచించటం ఇతరులను సలహాలు అడగటం, ఇతరులపై ఆధారపడటం వీరికి ఇష్టం ఉండదు. ఆధారపడరు. స్వయంగా ఆలోచిస్తారు. వెంటనే నిర్ణయాలు తీసుకొంటారు. అశ్రద్ధ, సోమరితనం, పిరికితనం వీరిలో ఉండదు. అనుకొన్నది సాధించుకొని తీరుతారు. జీవితంలో బాగా సంపాదిస్తారు. నలుగురికి మేలు చేస్తారు. మంచి నిర్ణయాలు తీసుకొం టారు. వీరికి మంచి అదృష్టం, సంపాదన, సుఖ సంతోషాలు ఉంటాయి. మంచి పేరు సంపాదించుకొంటారు.



బుద్ధిరేఖ ఇలా కొందరి చేతులలో జీవితరేఖకు చాలా దూరంలో ఏర్పడి ఉంటుంది. వీరికి తొందరపాటు ఎక్కువ. స్వతంత్రభావాలు ఎక్కువ. ఎవరినీ లెక్క చేయరు. వీరికి ఆత్మవిశ్వాసం, ధైర్యం, పట్టుదల, కోపం, తొందరపాటు అన్ని ఎక్కువే. తొందరపడ్తారు. తొందరపడి నిర్ణయాలు తీసుకొంటారు. జీవితంలో కష్టాలు కొనితెచ్చుకొంటారు. అనుకొన్న పనిని సాధించే వరకు నిద్రపోరు. ఎవరినీ సలహాలు అడగరు. ప్రక్కవారి అభిప్రాయాలు అడగరు. నిర్ణయాలు మార్చుకోరు. ఎంతకైనా తెగిస్తారు. వీరికి టెన్షన్ ఎక్కువ. వీరికి గురుబలం ఎక్కువగా ఈ లక్షణాలు అన్నియు చాలా ఎక్కువగా ఉంటాయి. వీరు మంచి చేయగలరు. చెడు చేయగలరు. దేనికైనా సమర్థులే.



కొందరి చేతులలో ఈ బుద్ధిరేఖ జీవితరేఖకు చాలా దూరంలో ఏర్పడి ఉంటుంది. దీనికితోడు అరచేతిలో గురుబలం చాలా ఎక్కువగా ఉంటే మంచిది కాదు. వీరికి అతికోపం, అతి తొందరపాటు ఎక్కువ. వెనుకాముందు ఆలోచించరు. ఆలోచనా రహితంగా నిర్ణయాలు తీసుకొం టారు. ఏ నిమిషంలో ఏం చేస్తారో వీరికే తెలియదు. లేని కష్టాలు కొని తెచ్చుకుంటారు. ఎవరినీ లెక్కచేయరు. వీరిలో మంచికన్నా చెడు లక్షణాలు ఎక్కువగా ఉండే ప్రమాదం ఉంది. వీరి తొందరపాటు నిర్ణయాలు ఒక్కొక్క సారి ప్రాణంమీదికి రావచ్చును. లేని ఇబ్బంది లలోపడే ప్రమాదం ఉంది. కోరి కష్టాలు తెచ్చుకొంటారు. అందువల్ల ఇలా ఉండటం మంచికన్నా, చెడు ఫలితములకే అవకాశం ఎక్కువ. వీరికి చిన్నాపెద్దా భేదం ఉండదు. నమ్మినవారి కొరకు ప్రాణాలు ఇవ్వగలరు, ప్రాణాలు తీసుకోగలరు.

బుద్ధిరేఖ, జీవితరేఖ విడిపోయి ఉండటంవల్ల మంచి జరుగుతుంది. చెడూ జరిగే అవకాశాలున్నాయి. భార్యాభర్తలు విడిపోయే ప్రమాదం కూడా ఉంది. లేనిచో ప్రతీరోజు గొడవలుపడే అవకాశాలు న్నాయి. రాజీపడలేరు. పడరు. అరచేతిలో బుద్ధిరేఖ ఇలా గురుస్థానం నుండి వచ్చి ఉండటం చాలా మంచిది. వీరు బాగా చదువుకొనే అవకాశం ఉంది. మంచి పేరు, పలుకుబడి నంపాదించే అవకాశం ఉంది. వీరు రాజకీయాలలో కూడా మంచి గుర్తింపు పొందగలరు. సమాజానికి సేవచేయగలరు. చేస్తారు. వీరు మంచినే గౌరవిస్తారు. మంచి పనులు చేస్తారు. ఎవరికైనా, పరిస్థితులకు తలవంచరు. ఓటమిని అంగీకరించరు. అన్న మాటకు ప్రాణాలు అయినా ఇస్తారు. వీరివల్ల కాని పని అంటు ఉండదు.



ఇలా జీవితరేఖ, బుద్ధిరేఖ విడిపోవటం వల్ల మంచి జరిగే అవకాశాలున్నాయి. చెడు జరిగే ప్రమాదం ఉంది. ఇలా ఉండటం వల్ల భార్యాభర్తల మధ్య మనస్పర్థలు వచ్చే అవకాశం, గొడవలు అయ్యే ప్రమాదం ఉంది. రెండు చేతులలోను ఇలాగే రేఖలు విడిపోయి ఉంటే భార్యాభర్తలు విడిపోయే ప్రమాదం ఉంది. లేదా ప్రతీరోజు గొడవలు పడే ప్రమాదం ఉంది. అయితే ఈ రెండు రేఖలను కలుపుతూ ఇలా చిన్న, చిన్న నిలువురేఖలు ఉంటే పైన చెప్పబడిన ప్రమాదాలు జరగవు. మంచి మార్పులుంటాయి. ఈ లక్షణాలు పురుషులకైనా, స్త్రీలకైనా ఒకేవిధంగా ఉంటాయి. వీరికి మంచి స్నేహం, మంచి అలవాట్లు ఉంటే మంచిది. లేనిఎడల వీరు జీవితంలో బాగా దెబ్బతినే ప్రమాదం ఉంటుంది. అయినా రేఖలు విడిపోవడం మాత్రం అంతమంచిది కాదు.





ఈ బుద్ధిరేఖ ప్రారంభంలో జీవితరేఖను అంటుకొని ప్రారంభంఅయి ఉండటం చాలా మంచిది. ఇలా ఉండటం వల్ల వారికి ధైర్యం, కార్యదీక్ష, పని పైన శ్రద్ధ, చురుకుదనం ఉంటాయి. స్వతంత్రముగా ఆలోచిస్తారు. స్వతంత్రముగా నిర్ణయాలు తీసుకొంటారు. మంచి ఆలోచనలు చేస్తారు. మంచి నిర్ణయాలు తీసుకొంటారు. అనుకొన్న పనులు చేస్తారు. మంచిఫలితాలు పొందుతారు. ఎలాంటి కష్టములకు భయ పడరు. ప్రారంభించిన పనులు పూర్తి చేసి తీరు తారు. వీరికి మంచిపైన, న్యాయుంపైన నమ్మకం ఎక్కువ. ఎదుటివారికి మేలు చేస్తారు. కాని హాని చేయరు. మంచిగా ఆలోచిస్తారు. మంచి నిర్ణయాలు చేస్తారు. అక్రమ మార్గంలో ప్రయాణం చేయరు. ఓటమిని అంగీకరించరు.



బుద్ధిరేఖనుండి ఒక రేఖ గురు స్థానమునకు చేరి ఉంటే చాలా మంచిది. వీరు మంచి పనులు చేస్తారు. మంచిస్థాయికి చేరుకొం టారు. మంచి పలుకుబడి, గౌరవం సంపాదిం చుకొంటారు. వారు రాజకీయా లల్లో, ఉద్యోగ రీత్యా, మంచి పేరు సంపాదిం చుకోగలరు. సమాజానికి సేవ చేస్తారు. అయితే ఆ వ్యక్తి చేయి మొరటుగా, గట్టిగా ఉంటే అన్ని ఫలితములు ఉండవు. మొరటు పనులు, నీతిలేని పనులు, నిలకడ లేని పనులు చేస్తారు. అతి సామాన్య మైన జీవితం గడుపుతారు. ఆర్థిక ఇబ్బందులు ఎదుర్కొంటారు. మొరటుగా చేయి ఉంటే సుఖసంతోషాలుండవు.

ఈ బుద్ధిరేఖ కుజస్థానమునుండి వచ్చినచో ఆ వ్యక్తికి స్థిరమైన ఆలోచనలు, స్థిరమైన నిర్ణయాలు ఉండవు. అందువల్ల ఏ పనిని పూర్తిగా చేయలేరు. అందువల్ల సామాన్యమైన జీవితం, అభివృద్ధిలేని జీవితం గడుపుతారు. వీరికి కోపం ఎక్కువ. ఓర్పు ఉండదు. ఆలోచనలు లేని పనులు చేస్తారు. జీవితంలో సమస్యలు ఎదుర్కొంటారు. వీరికి ఎన్నో ఆలోచనలు ఉన్నను సరియైన అవగాహన లేకపోవటం వల్ల పని యందు మనసు నిమగ్నం కాలేకపోవటం వల్ల అపజయములు ఎదుర్కొంటారు. ప్రఖ్యాతిలేని జీవితం గడుపుతారు.



ఈ బుద్ధిరేఖ జీవితరేఖతో కలసి కొంతదూరం ఉండటం మంచిదికాదు. అందువల్ల ఆ వ్యక్తికి పిరికితనం ఉంటుంది. ధైర్యంగా నిర్ణయాలు తీసుకోలేరు. పనిని ఆచరణలో పెట్టలేరు. ఆలోచనలతోనే కాలం గడుపుతారు. ఏం చేస్తే ఏమి అవుతుందో, ఎలాంటి కష్టం ఎదుర్కో వలసి వస్తుందోన్న భయంలో పనిని ప్రారంభించటానికి వెనుకాడుతారు. అందువల్ల సామాన్య జీవితం గడుపుతారు. ఆర్థిక ఇబ్బం దులు పడ్తారు. తాము సుఖపడలేరు. వారిని నమ్ముకున్నవారు సుఖపడలేరు. వీరి భయమే, వీరి అపనమ్మకమే వీరి మొదటి శత్రువు.



బుద్ధిరేఖ ప్రారంభములో జీవితరేఖను అంటియుండి అది చంద్ర ఆకారములో వంగి చంద్రస్థానములోనికి వచ్చి ఆగిపోవటం వల్ల చాలా మంచిది. అసలు బుద్ధిరేఖ ఇలా ఉంటేనే చాలా మంచిది. వీరికి మంచి తెలివితేటలు, మంచి ఆలోచనాశక్తి, మంచి గ్రహణశక్తి ఉంటాయి. వీరు వారి తెలివితుటలతోనే బ్రతకగలుగుతారు. వీరు మంచి మాటకారులు. వీరు వ్యాపారంలో, రాజకీయాలలో, మంచి పలుకుబడి సంపాదిస్తారు. వీరి మాటలగారడితో నలుగురిని మెప్పించగలరు. వీరి మాటలే, వీరి తెలివితేటలే వీరికి పెట్టుబడి. వీరు వీరి తెలివితేటలతోనే బ్రతకగలరు, సంపాదించ గలరు, సుఖపడగలరు.



ఈ బుద్ధిరేఖ ఇలా పూర్తిగా చంద్ర స్థానములోనికి వాలిపోయి ఉండటం మంచిదికాదు. వీరికి బాగాలోతుగా, ఎక్కువగా, అనవసరంగా ఆలోచించి, మనసు పాడు చేసుకొనే స్వభావం ఉంటుంది. ప్రతీ చిన్న విషయాన్ని భూతద్దంలో చూసుకొని బాధపడ్తారు. మనసు పాడుచేసు కుంటారు. చిన్న సమస్యను కూడా తట్టుకో లేరు. ఆలోచనలలో మునిగిపోతారు. సంతోషంగా ఉండలేరు. వీరికి ధైర్యం, తెగింపు ఉండవు. నిలకడలేని ఆలోచనలతో మనస్సును జీవితాన్ని పాడుచేసుకొంటారు. వీరికి దాంపత్య జీవితం బాగుండదు. దంపతులు విడిపోయే అవకాశం ఎక్కువ. ఒంటరి జీవితంతో, పిరికితనంతో బాధలు పడ్తారు. చిన్నచిన్న బాధలకే ఆత్మహత్య చేసుకోవాలని అనుకొంటారు. అందువల్ల వారి జీవితం నరకంగామారే ప్రమాదంఉంది.



కొందరి చేతులలో ఈ బుద్ధిరేఖ ఒక గీతలాగా ఏర్పడి ఉంటుంది. ఇలా ఉండటం మంచిదికాదు. ఇది అరచేయికి అడ్డంగా, ఒక గీతలాగా ఉన్నందువల్ల వీరికి స్వార్థం ఎక్కువగా ఉంటుంది. ఈర్ష్యగుణం కూడా ఎక్కువే. వీరు ఇతరులను చూసి ఓర్వలేరు. వీరికి మూర్ఖపు పట్టుదల, కోపం ఉంటాయి. అందువల్ల వీరు నలుగు రితో కలసి ఉండలేరు. వీరికి సర్దుబాటు తత్వంకూడా



తక్కువ. అయిననూ అరచేతి లోని త్రిభుజం బాగునట్లయితే, బుధరేఖ బాగున్నట్లయితే కొంతవరకు మంచి మార్పు లుంటాయి. వీరు మంచి విద్యా వంతులు అయ్యే అవకాశం ఉంది.

సామాన్యంగా ప్రతిచేతిలో మూడు రేఖలు స్పష్టంగా ఉంటాయి. జీవితరేఖ, బుద్ధిరేఖ, ఆత్మరేఖ. కాని ఈ చేతిలో బుద్ధిరేఖ ఆత్మరేఖతో కలసిపోయి ఒకే రేఖగా అరచేయికి అడ్డంగా ఒకే గీతలాగా ఏర్పడి ఉంది. ఇలా ఉండటం అంతమంచిది కాదు. ఇలా ఉన్నవారికి మొండితనం, పట్టుదల, ఆత్మవిశ్వాసం ఎక్కువ. వీరు వ్యాపారాలు చేస్తే బాగా సంపాదించగలరు. కాని పోగొట్టుకొనే ప్రమాదం కూడా ఉంది. వీరు మనసు పెట్టి



ఆలోచించరు. బుద్ధిచెప్పినట్లు చేస్తారు. ఎదుటివాళ్ళ మనస్సును గ్రహించరు. వీరకి జాలి, దయాగుణములుండవు. వీరిలో కొంతమందికి దాంపత్య జీవితం కూడా బాగుండదు. భార్యాభర్తలు చివరి వరకు కలసి ఉండటం కష్టం. వీరికి రెండవ వివాహం జరిగే అవకాశాలున్నాయి.

కొందరి చేతులలో ఈ బుద్ధిరేఖ వంకరగా ఆత్మరేఖవైపు తిరిగి ఉంటుంది. ఇలా బుద్ధిరేఖ ఉండటం మంచిదికాదు. వీరికి కూడా నిలకడ అయిన ఆలోచనలు, నిలకడైన పనులు ఉండవు. పైగా పిరికితనం, అపనమ్మకం ఉంటుంది. ఎక్కువ కాలం ఏ వృత్తిలోను నిలకడగా ఉండలేరు. అందువల్ల ఆర్థిక ఇబ్బందులు, పేదరికం, కష్టాలు అనుభవిస్తారు. వీరిలో కొంతమందికి హాస్యంగా మాట్లాడడంలో నేర్పరులుంటారు. వీరికి ఆలోచనలు, దూరదృష్టి ఉండదు. ఒక విధంగా వీరికి తెలివితేటలు తక్కువ అని చెప్పవచ్చును.



కొందరి చేతులలో ఈ బుద్ధిరేఖ చాలా చిన్నగా ఉంటుంది. ఇది దాదాపు శనిస్థానం వద్దకు వచ్చి ఆగిపోయి ఉంటుంది. అందువల్ల వీరికి ఓర్పు, సహనం, లౌకికం ఉండదు. వీరికి కోపం ఎక్కువ. ఆలోచనా రహితంగా ఉంటారు. ఆలోచనలు లేని పనులు చేస్తారు. నిలకడైన ఆలోచనలు, పనులు ఉండవు. ఎక్కువగా ఏ వృత్తిలోను ఎక్కువకాలం ఉండలేరు. అందువల్ల ఆర్థిక ఇబ్బందులు ఎదుర్కొంటారు. అపజయ ములు కష్టాలు ఎదుర్కొంటారు. వీరు తలపెట్టిన కార్యములకు పూర్తిగా న్యాయం చేయరు. పనిని మధ్యలోనే వదిలివేస్తారు. భవిష్యత్తును దృష్టిలో ఉంచుకొని నిర్ణయాలు చేయరు. అదే వీరి మొదటి తప్పు. దూరాలోచన ఉండదు వీరికి.



ఈ అరచేతిలో బుద్ధిరేఖ బాగాలేదు. అస్పష్టంగా కనిపించి కనిపించనట్లు ఉంది. ఇలా బుద్ధి రేఖ ఉండటం దురదృష్టమే. వీరికి అదృష్టం కలసిరాదు. పట్టుదల, ఓర్పు ఉండదు. అసలు ఆలోచన, మంచి జీవితంపై కోరిక ఉండదు. తెలివితక్కువ పనులు చేస్తారు. నిలకడలేని జీవితం, నిలకడలేని ఆదాయంతో ప్రతీరోజు నరకం అనుభవిస్తారు. చెడు ఆలోచనలు, చెడు అలవాట్లతో జీవితం పాడుచేసుకొంటారు. వారిని నమ్ముకొన్న వారికి న్యాయం చేయలేరు. వారికి కూడా కష్టాలు తప్పవు.



ఈ చేతిలో బుద్ధిరేఖ ముక్కలు, ముక్కలుగా ఏర్పడి ఉంది. వీరికి కూడా ఓర్పు, పట్టుదల, కార్యదీక్ష ఉండదు. వీరు జీవితంలో అనేకసార్లు దెబ్బతింటారు. చేస్తున్న పనులలో ఇబ్బందులు ఎదుర్కొంటారు. నష్టపోతారు. డబ్బులు నష్టపోతారు. రెండు చేతులలో రేఖలు ఇలాగే ఉంటే చాలా ప్రమాదం. కొంతకాలం బాగుంటే కొంతకాలం బాగుండదు. ఇలా రేఖలు ముక్కలు, ముక్కలుగా ఉండటం మంచిదికాదు. వీరికి కూడా దాంపత్య జీవితంలో అనేక సమస్యలుంటాయి. అసహనంతో జీవితంలో అనేక కష్టాలపాలు అవుతారు. అరచేతిలో ఏ రేఖకూడా ముక్కలు ముక్కలుగా ఉండటం చెడు ఫలితాలనే ఇస్తుంది.



ఈ బుద్ధిరేఖ స్పష్టంగా, లోతుగా, కాంతివంతంగా, పొడవుగా ఏర్పడి కుజస్థానం చేరి నిలచి ఉంటే చాలా అదృష్టం. వీరికి మంచి ఆలోచన, ధైర్యం, పట్టుదల ఉంటాయి. దానికి తోడు వీరికి గురుస్థానం బాగుండి, గురుస్థానంలో ఒక త్రికోణము ఏర్పడి ఉంటే వీరు తమ స్వంత తెలివి తేటలతో, కృషి చేసి పైకివస్తారు. మంచి పొజిషన్‌కు చేరుకొంటారు. వీరు రాజకీయా లలో గొప్పపేరు, గౌరవం, పొందుతారు. వీరికి రాజకీయాలు కలసి వస్తాయి. వీరి చేతిలో బుధరేఖ ఉంటే వ్యాపారాలలో సంపాదిస్తారు. సూర్యరేఖ స్పష్టంగా ఏర్పడి ఉంటే రాజకీయాలలో మంచి పనులుచేసి పేరు సంపాదించుకొంటారు. వీరు గొప్ప అదృష్టవంతులు.



గురుస్థానం బాగుండి, అరచేయి కోమలంగా ఉండి, బుద్ధిరేఖ నుండి కొన నిలువు రేఖ ఏర్పడి అది గురుస్థానం లోనికి చేరి ఉండటం చాలా మంచిది. ఇలా ఉండటం వల్ల వీరికి ధైర్యం, పట్టుదల, మంచి ఆలోచనలుంటాయి. పట్టుదలతో పనిచేస్తారు. పనిని పూర్తిచేస్తారు. అనుకొన్న పనిని సాధించుకొంటారు. వీరికి ఇష్టమయిన పనులు చేసి బాగా గుర్తింపు పొందుతారు. సంపాదిస్తారు. అందరికి ఉపయోగపడ్తారు. మంచి పనులు చేసి నలుగురిలో గౌరవం, పేరు సంపాదించు కొంటారు. వీరికి కుటుంబ జీవితం బాగుంటుంది. వీరు మంచి కొరకు ప్రాకులాడు తారు. మంచి కొరకు ప్రాణం ఇస్తారు. మంచి చేయటంలో తృప్తి పొందుతారు. నలుగురికి సహాయం చేస్తారు. గౌరవం పొందుతారు.





కొందరి చేతులలో ఈ బుద్ధిరేఖ బాగుండదు. పాములాగా వెలికలు, వెలికలుగా తిరిగి ఉంటుంది. ఇలా ఉండటం మంచిదికాదు. దీనికి తోడు అర చేతిలో ఆత్మరేఖకూడా పొట్టిగా ఉన్నట్లయితే వారికి నిలకడైన ఆలోచన లుండవు. నిలకడైన వృత్తి ఉండదు. రేపటి గురించి ఆలోచించరు. చెడు స్నేహాలు చెడు అలవాట్లు వస్తాయి. సంసారజీవితం దెబ్బ తింటుంది. సంపాదన నిలకడగా ఉండదు. అనేక కష్టములు పొందుతారు. సంపాదన లేక దరిద్రము అనుభవిస్తారు. వీరికి నీతి నియమాలుండవు. మంచి ఆలోచనలు, మంచి గుణములుండవు. సోమరులుగా జీవిస్తారు. కష్టములు అనుభవిస్తారు.



కొందరి చేతులలో ఈ బుద్ధిరేఖ గొలుసులాగా ఏర్పడి ఉంటుంది. ఇలా రెండు చేతులలో ఉంటే మరీ ప్రమాదం ఆత్మరేఖ కూడా ఇలాగే గొలుసులాగా ఉంటే హృదయం లేనివారు అయి, సోమరిపోతులై కాలం గడువుతారు. వీరు త్రాగుబోతులుగా, జూదరులుగా, జీవిస్తారు. చెడు స్నేహాలు, చెడు అలవాట్లు వీరి బలహీనత. గౌరవం, మర్యాద, మంచితనం వీరికి నచ్చదు. నిలకడలేని ఆలోచనలు కలిగి, నిలకడలేని ఆదాయంతో కష్టాలు అనుభవిస్తారు. ప్రక్కవారిని ఇబ్బందిపెడ్తారు. వీరివల్ల తోటివారికి కష్టములు తప్పవు. సమాజానికి వీరివల్ల ఎన్నో సమస్యలు వస్తాయి.

కొందరి చేతులలో ఈ బుద్ధిరేఖ పొడవుగా ఉండి ముందు భాగంలో రెండు పాయలుగా చీలి ఉంటుంది. బుద్ధిరేఖ ఇలా ఉండటం చాలా మంచిది. దీనికి తోడు వీరి అరచేతిలో చంద్రస్థానం కూడా ఎత్తుగా ఉంటే చాలామంచిది. ఇలా బూద్ధిరేఖ ముందు భాగం పాయలుగా చీలి ఉన్నవారికి మంచి తెలివితేటలుంటాయి. వీరు ప్రతి పనిని రెండు విధాలుగా ఆలోచిస్తారు. ప్రతి పనికి రెండు విధాలుగా ప్లాన్ చేసుకొంటారు. ఒక పద్ధతిలో పని జరగకపోతే రెండవ పద్ధతిలో చేద్దాము అని ముందుగానే ఆలోచించుకొని ఉంటారు. వీరికి తెలివితేటలు, అదృష్టం ఎక్కువే.



కొందరి చేతులలో ఈ బుద్ధిరేఖ స్పష్టంగా, లోతుగా, కాంతివంతంగా, పొడవుగా ఉంటుంది. వీరికి మంచి ఆలోచన లుంటాయి. పట్టుదలతో పనిచేస్తారు. అభివృద్ధి సాధించుకొంటారు. కాని ఇదే బుద్ధిరేఖపై కొందరి చేతులలో చిన్నచిన్న అడ్డురేఖలు ఏర్పడి ఉంటాయి. ఇలా ఉండటం మంచిది కాదు. ఇలా ఉండటం వల్ల అనేక కష్టములు, ఆర్థిక ఇబ్బందులు, వృత్తిలో సమస్యలు ఏర్పడుతాయి. జీవితంలో నష్టములతోపాటు శాంతి ఉండదు. జీవితంపై విరక్తి పుడుతుంది. కొన్ని కొన్ని సందర్భాలలో కోలుకోలేని ఇబ్బందులు వస్తాయి. అందువల్ల రేఖలపై అడ్డురేఖలుండటం మంచిదికాదు.



# ఆత్మరేఖ (హృదయరేఖ)



ప్రతీవ్యక్తి చేతిలో మూడు రేఖలు సామాన్యంగా ఉంటాయి. ఒకటి జీవితరేఖ, రెండవది బుద్ధిరేఖ, మూడవది హృదయరేఖ. హృదయరేఖ కూడా చాలా ముఖ్యమైన రేఖ.

**ఆత్మరేఖ**



దీనిని ఆత్మరేఖ అంటారు. లేదా హృదయరేఖ అంటారు. సామాన్యంగా అందరి చేతులలో ఈ రేఖ ఉంటుంది. అయితే అన్ని రేఖలు స్పష్టంగా, సన్నగా లోతుగా ఉంటే మంచిది కాని ఈ ఆత్మరేఖ స్పష్టంగా లోతుగా ●ంచము వెడల్పుగా ఉంటే చాలా మంచిది. ఆత్మరేఖ హృదయానికి, సంతోషానికి, కష్టసుఖ ములకు సంబంధిం చిన రేఖ. ఈ రేఖ ఎంత బాగుంటే ఆ వ్యక్తికి అంతమంచి గుణములుంటాయి. సుఖపడుతాడు. సుఖపెడ్తారు. హృదయ రేఖ బాగున్నవారు ప్రేమిస్తారు. ప్రేమింప బడుతారు. ప్రేమ జీవితం గడుపుతారు. మంచి కొరకు జీవిస్తారు. మంచి కొరకు మరణిస్తారు. మంచి గుణములుంటాయి. అన్ని పనులు ప్రేమతో మంచి తనంతో సాధించుకొంటారు. వీరికి ఓర్పు, మంచి గుణాలుంటాయి. ఇతరులకు మేలు చేస్తారు కాని హాని చేయరు. అయితే ఈ హృదయరేఖ బాగా లేనిచో వీరు భగ్నప్రేమికులు అవుతారు. నిలకడలేని ప్రేమ ఉంటుంది. జాలి, దయ, ప్రేమగుణాలుండవు. స్వార్థం ఉంటుంది. ప్రేమలో ఓడిపోతారు. చెడు వ్యసనాలకు బలి అవుతారు. వీరికి మంచి మనసు, హృదయం, స్నేహం ఉండదు. ఎదుటివారిని మోసగించి స్వార్థంతో జీవిస్తారు. చెడు చేయటానికి వెనుకాడరు. డబ్బుకొరకు అమ్ముడుపోతారు. అందువల్ల ఈ హృదయరేఖ చెడుగా, అస్పష్టంగా చిన్నదిగా ఉండకూడదు.

హృదయ రేఖ స్పష్టంగా, పొడవుగా ఉంటే సుఖశాంతులుంటాయి. ప్రేమిస్తారు. ప్రేమింపబడుతారు. మంచి పనులు చేస్తారు. మంచిని సంపాదించుకొంటారు. ఎదుటి వారి కొరకు వారి జీవితాన్ని త్యాగం చేస్తారు. సర్వం అర్పిస్తారు. వీరికి స్వార్థం ఉండదు. నిస్వార్థంగా ఉంటారు. సుఖపడ్తారు. సాటివారికి సుఖాన్ని పంచుతారు.

ఈ ఆత్మరేఖ పొడవుగా కొంచము వెడల్పుగా, గురుస్థానం చేరుకొని నిలచి పోవటం మంచిది. ఇది పూర్తిగాఉన్న ఆత్మరేఖ. ఇలా ఉన్నవారికి ఓర్పు, జాలి, దయ, మంచి గుణములుంటాయి. కోపం ఉండదు. ఎదుటివారిని ప్రేమిస్తారు. మంచి చేస్తారు. హాని చేయరు. ప్రేమిస్తారు. ప్రేమింపబడు తారు. ప్రేమించినవారి కొరకు అన్ని వదులుకోవటాన్ని సిద్ధపడ్తారు. వీరికి స్వార్థం ఉండదు. అన్ని పనులు స్వార్థం లేకుండానే చేస్తారు. వీరి స్నేహం పొందటం అదృష్టమే. వీరు మంచిని కోరుకుంటారు. మంచినే ఆలోచిస్తారు. మంచి పనులే చేస్తారు. ఇతరులకు మేలు చేస్తారు కాని హాని చేయరు. మంచి హృదయం ఉంటుంది వీరికి.



అందరి చేతులలో హృదయరేఖ ఉంటుంది. కొందరి చేతులలో ఈ హృదయరేఖ బుద్ధిరేఖతో కలసిపోయి అడ్డంగా ఏర్పడి ఉంటుంది. కాని హృదయ రేఖ ఉండనివారు ఉండరు. ఈ హృదయ రేఖ అరచేతిలో లేని వారు బాల్యంలోనే చనిపోయే ప్రమాదం ఉంది. ఈ ఆత్మరేఖ చేతిలో లేనట్లయితే వారికి జాలి, దయ, ప్రేమ, అనురాగం, స్నేహం ఉండదు. వీరు రాక్షసులుగా జీవిస్తారు. ఎదుటివారిని కష్టపెట్టి, నష్టపరచి సంతోషిస్తారు. స్వార్థం ఉంటుంది. వీరికి ప్రేమ, హృదయం ఉండదు. వీరు సమాజంతో కలసి జీవించలేరు. సాటివారిని కష్టాల పాలు చేస్తారు. వీరు సుఖపడలేరు. చెడు అలవాట్లు, చెడుస్నేహాలుచేసి జీవితం పాడు చేసుకుంటారు.





ఆత్మరేఖ పొడవుగా, స్పష్టముగా, లోతుగా, కాంతివంతంగా, చక్కగా ఉన్న జాతకుడు మంచి అదృష్టవంతుడు. వీరికి ప్రేమ, జాలి, దయ అన్ని మంచిగుణాలు ఉంటాయి. ప్రేమిస్తారు. ప్రేమింపబడుతారు. అరచేతిలో ఈ ఆత్మరేఖ పూర్తిగా గురుస్థానం లోనికి పోయి ఇలా రెండు పాయలుగా చీలి ఉంటే చాలా మంచిది. వీరికి అన్ని మంచి గుణాలుంటాయి. సాటివారిని ప్రేమిస్తారు. ప్రేమించిన వారి మేలు కోరుకొంటారు. ప్రేమించిన వారి కొరకు సర్వం ధారపోస్తారు. అన్నీ వదలుకొంటారు. ఎలాంటి త్యాగానికైనా సిద్ధపడ్తారు. వీరికి స్వార్థం ఉండదు. మేలు చేస్తారు కాని కీడు చేయరు.



కొందరి చేతులలో ఈ ఆత్మరేఖ శనిస్థానంలోపే ఆగిపోయి ఉంటుంది. ఇలా ఉండటం అంతమంచిది కాదు. వీరికి ప్రేముంటుంది కాని నిలకడైన ప్రేమ ఉండదు. కొంచము స్వార్థంకూడా ఉంటుంది. లాభంలేని పనులు చేయరు. అవసరాన్ని బట్టి మనసు మార్చుకుంటారు. నిలకడైన ప్రేమానురాగాలుండవు వీరికి. గురుస్థానం బాగా లేకపోతే చెడు పనులుకూడా చేస్తారు. వీరికి చెడు అలవాట్లు, బలహీనతలు వచ్చే అవకాశాలుంటాయి. అందువల్ల ఈ హృదయరేఖ చిన్నదిగా, ఉండటం మంచిదికాదు. వీరు సుఖపడతారు. ఎదుటివారిని సుఖపెట్టలేరు. వీరికి మంచి హృదయం ఉండదు.

ఈ ఆత్మరేఖ మరీ చిన్నదిగా ఉండటం మంచిదికాదు. ఇలా ఉండటం దురదృష్టమే. ఇలా ఉన్నవారికి ప్రేమ, జాలి, హృదయం ఉండదు. ఎదుటివారిని ఏడిపిస్తారు. స్వార్థం ఉంటుంది. నిలకడ ఉండదు. వీరికి సంసార జీవితం కూడా సంతోషంగా ఉండదు. స్వార్థంతో ఎదుటివారిని హింసిస్తారు. వీరికి ఆదాయం,

సుఖసంతోషా లుండవు. అతి సామాన్యమైన జీవితం గడుపుతారు. ఎవరి తోనూ కలసి ఉండలేరు. అన్ని చెడు అలవాట్లు రావచ్చును. అరచేయి మోటుగా ఉంటే దొంగలుగా మారే అవకాశం ఉంటుంది.





ఇలా అరచేతిలో హృదయరేఖ గొలుసులాగా ఏర్పడి ఉంటే మంచిదికాదు. వీరికి నిలకడైన మనసు, నిలకడైన ఆలోచన లుండవు. వారు మోసాలు చేసి జీవించే అవకాశం ఉంది. రెండు చేతులలో ఇలాగే ఉంటే నిలకడైన వృత్తి, ఆదాయం ఉండదు. కష్టాలు అనుభవిస్తారు. దంపతులు విడి పోతారు. సంసార జీవితం హాయిగా గడవదు. వీరికి జాలి ఉండదు. వారు ఎదుటి వారికి చెడు చేస్తారు కాని మంచి చేయలేరు. వీరితో స్నేహం చేసిన వారు కూడా కష్టాలు అనుభవిస్తారు. చెడిపోతారు. నీచమైన పనులు చేస్తూ కాలం గడుపుతారు.

ఈ ఆత్మరేఖ బయలుదేరి బుద్ధిరేఖ, ఆయుషురేఖతో కలసిపోవటం కొందరి చేతులలో కన్పిస్తుంది.సామాన్యంగా ఇలాంటి చేయి ఉండటం చాలా కష్టం. ఇలా ఉన్నప్పుడు వారి నిర్ణయాలు కూడా ప్రత్యేకంగా ఉంటాయి. వీరు ఏ నిమిషంలో ఏ నిర్ణయం తీసుకొంటారో వారికే తెలియదు. వీరు వీరి జీవితంలో బాగా సుఖపడే అవకాశాలుంటాయి. అనుకోకుండా కష్టాలపాలు అయ్యే ప్రమాదం ఉంది. వీరి జీవితం లాటరీ టికెట్‌లాంటిది.





కొందరి చేతులలో ఈ హృదయరేఖ శనిస్థానం దగ్గర ఆగిపోతుంది. ఇలా చాలా మంది చేతులలో కన్పిస్తుంది. వీరికి ప్రేమ, జాలి ఉంటాయి. కాని నిలకడగా ఉండకపోవచ్చును. స్వార్థతోనే పనులు చేస్తారు. వీరు వీరి జీవితంలో కష్టాలు పడే అవకాశం ఉంది. సుఖపడే అవకాశం ఉంది. ఒక విధంగా రెండూ సమానంగా ఉండవచ్చును. వీరు శ్రమ చేసి జీవితంలో సంపాదించుకొంటారు. వీరికి మధ్యరకమైన జీవితం లభిస్తుంది. వీరు వీలునుబట్టి వీరి అభిప్రాయాలు మార్చుకొంటారు.



ఆత్మరేఖ పొడవుగా ఉండి ఆత్మరేఖ నుండి చిన్న పాయరేఖలు క్రిందివైపు వాలి ఉండటం కొందరి చేతులలో కన్పిస్తుంది. ఇలా ఉండటం మంచిదికాదు. ఇలా ఉన్నప్పుడు వారు ప్రేమలో విఫలంఅయ్యే అవ కాశం ఉంది. జీవితంలో చాలాసార్లు మానసిక ఇబ్బందులు, ఎదుటివారి వల్ల కష్టనష్టములు ఎదుర్కొనే ప్రమాదం ఉంది. అరచేతిలో, శుక్రస్థానం, చంద్రస్థానం ఎత్తుగా ఉంటే ఇతరులతో శారీరక సంబంధాలు ఏర్పడవచ్చును.



అరచేయిలో ఈ ఆత్మరేఖ కొందరి చేతులలో విరిగిపోయి ఉండటం మంచిది కాదు. కొందరికి చిన్నతనంలోనే తల్లినికాని, తండ్రినికాని కోల్పోయే అవకాశం ఉంది. యవ్వనంలో ప్రేమించినవారికి దూరం అయ్యే ప్రమాదం ఉంది. మానసికంగా బాగా దెబ్బతినే అవకాశం ఉంది. కొందరు తట్టుకోలేక చెడు అలవాట్లకు బానిసలు అయ్యే అవకాశం ఉంది. ఇలా ఆత్మరేఖ విరిగి ఉండటం ప్రమాదం.

# అదృష్ట రేఖ

### (ధనరేఖ)



ఈ రేఖను ధనరేఖ అంటారు. ఇది అందరి చేతులలో కన్పించదు. కొందరి చేతులలోనే కన్పిస్తూ ఉంటుంది.

అరచేతిలో అడుగు భాగంనుండి ప్రారంభం అయి శనిస్థానం వరకు వచ్చి నిలిచి పోయి ఉన్న ఈ రేఖను అదృష్టరేఖ అంటారు. ధనరేఖ అని, కర్మరేఖ అనికూడా అంటారు. ఎక్కువ మంది దీనిని ధనరేఖ అని పిలుస్తారు. ఇది ఉన్నంత మాత్రాన ధనం ఉంటుందని చెప్పకూడదు. ఈ రేఖలేనివారు కూడా డబ్బు కలవారున్నారు. అయితే బాగా డబ్బులు సంపాదించిన వారి చేతులలో ఈ రేఖ స్పష్టంగా ఉంటుంది. ఈ రేఖ స్పష్టంగా ఉన్నవారు జీవితంలో బాగా శ్రమ చేసి సంపాదిస్తారు. పనిచేసి ఫలితాలు సాధించుకొంటారు. శ్రమకు భయపడరు. సోమరితనం ఉండదు వీరికి. వీరికి కాలం విలువ బాగా తెలుసు. శ్రమ చేసి సంపాదిస్తారు. స్థిరాస్థులుకొంటారు. భోగభోగ్యాలు అనుభవిస్తారు. నమ్ముకొన్న వారికి బాగా ఖర్చుచేస్తారు. ఈ రేఖ ఎంత బాగా ఉంటే వారి ఆదాయం అభివృద్ధి అంతబాగా ఉంటుంది. వీరు శ్రమచేయటానికి వెనుకాడరు. పట్టుదలతో పనిచేస్తారు. సంపాదిస్తారు.



కొందరి చేతులలో ఈ అదృష్టరేఖ అరచేయి అడుగుభాగంలో నుండి ప్రారంభం అయి ఉంటుంది. ఇలా ఉండటం వల్ల వీరికి పరిస్థితుల ప్రభావం వల్ల చిన్నతనం నుండియే బాధ్యతలు వహించవలసి వస్తుంది. సంపాదించవలసిన అవసరాలు, నమ్మినవారి కొరకు శ్రమ పడవలసిన అవసరాలు వస్తాయి. చిన్నతనం నుండియే పనిచేస్తూ ఎన్నో అనుభవాలు నేర్చుకొంటూ జీవితంలో పైకి వస్తారు. వీరికి ఎలాంటి కష్టములు వచ్చినా తట్టుకొని నిలబడగలుగుతారు.



ఈ అదృష్టరేఖ జీవితరేఖలోనుండి ప్రారంభం అయి శనిస్థానం చేరుకొని ఉంది. ఇలా ఉండటంవల్ల ఆ వ్యక్తి స్వయం కృషితో జీవితంలో అభివృద్ధిని సాధించుకొంటారు. ఇతరులపై ఆధారపడరు. ఇతరులపై ఆధార పడవలసిన అవసరం ఉండదు వీరికి. వీరికి ఆత్మవిశ్వాసం ఉంటుంది. ఏ ఆలోచ నైనా స్వయంగా చేస్తారు. స్వంతనిర్ణయాలు తీసు కొంటారు. వీరు ఏ పనిని ప్రారంభిం చిననూ విజయం సాధిస్తారు. ఓటమిని అంగీకరించరు.





కొందరి చేతులలో ఈ ధనరేఖ అరచేతి క్రిందిభాగంలో ప్రారంభం అయి ఆత్మరేఖ వద్ద ఆగిపోతుంది. ఇలా ఉండటం వల్ల వీరు కష్టపడి సంపాదిస్తారు కాని తమ సంపాదనంతా అయినవారికి, వీరు ఇష్ట పడేవారికి ఖర్చు చేస్తారు. తమ స్వార్థం చూసు కోరు. వీరి సంపాదన అంతా వరులను బాగు చేయటానికి, ఇతరుల కష్టాలు తీర్చుటానికే ఉపయోగపడుతుంది. వీరు ఇతరుల సుఖశాంతులకొరకు పాటు పడుతారు.

కొందరి చేతులలో ఈ అదృష్టరేఖ చంద్ర స్థానంలో నుండి బయలుదేరి వస్తుంది. ఇలా ఉండటంవల్ల చాలా మంచిది. సామాన్యంగా వీరు తమ స్వస్థలం వదలి పరస్థానంలో స్థిరపడు తారు. పరస్థానమే వీరికి కలసివస్తుంది. వీరికి స్వస్థలం కలసిరాదు. వీరికి స్థానబలం వల్ల, ఇతరుల వల్ల కుటుంబ సభ్యుల అదృష్టం వల్ల సంపాదన, సుఖ సంతోషా లుంటాయి. వీరికి స్వంత ఆలోచనలు పనికి వస్తాయి. వీరికి ఆలోచనా శక్తి బాగా ఉంటుంది. వీరికి స్పెక్యు లేషన్‌లు, ఆకస్మిక ధన ప్రాప్తివల్ల సంపాదన పొందే అదృష్టం ఉంటుంది.



కొందరి చేతులలో ఈ ధనరేఖ బుద్ధిరేఖ వద్దనే ఆగిపోయి ఉంటుంది. ఇలా ఉండటం వల్ల ఆవ్యక్తి సంపాదన నిలువదు. సంపాదన అంతే తాను తీసుకొనే తప్పుడు నిర్ణయాలవల్ల సంపాదన పోగొట్టుకొనే ప్రమాదం ఉంది. వీరికి 35 సంవత్సరాల వయస్సు వరకు అదృష్టం పెద్దగా కలసిరాదు. సంపాదన అంతాపోయే ప్రమాదం ఉంది. వీరు 36 సంవత్సరాల వయస్సు తర్వాత జీవితంతో స్థిరపడ గలుగుతారు.





కొందరి చేతులలో ఈ ధనరేఖ బుద్ధిరేఖ నుండి ప్రారంభం అయి ఆత్మరేఖ వద్దనే ఆగిపోయి ఉంటుంది. అందువల్ల వీరికి బాల్యంలో, ప్రారంభదశలో ఆదాయం ఉండదు. 35 సంవత్సరాల వయస్సు నుండి వీరు వీరి స్వంత తెలివి తేటలతో బాగా సంపాదిస్తారు. అయినా ఈసంపాదన అంతా వీరు కోరుకొనేవారి కొరకు ఖర్చు చేస్తారు. వీరికి 35సంవత్సరాల వయస్సు తర్వాతనే అదృష్టం కలసివస్తుంది. సుఖ శాంతులు లభిస్తాయి.సంపాదిస్తారు, సుఖపడు తారు.

అరచేతిలో ఉన్న అదృష్టరేఖపై పైకి లేచి ఉన్న చిన్న చిన్న రేఖలు చాలా లాభం చేస్తాయి. ఆ సమయంలో మంచి సంపాదన, వృత్తి రీత్యా లాభం కలుగుతుంది. మంచి సంపాదన పలుకుబడి, గౌరవం సంపాదించుకొంటారు. వీరు ఏ పనిచేసినా కలసివస్తుంది. అనుకోని అదృష్టం వీరిని కాపాడుతుంది. వీరు వ్యాపారాలు చేస్తే బాగా సంపాదించగలరు.



ఇలా అదృష్టరేఖలో లంకగుర్తు ఏర్పడి ఉండటం చాలా ప్రమాదం. ఆ వయస్సులో ఆ వ్యక్తి వృత్తిరీత్యా బాగా నష్టపోతారు. వ్యాపారంలో సర్వం కోల్పోతారు. మరల కోలుకోవటం చాలా కష్టం. మరల కొద్ది కాలం తర్వాత ధనరేఖ బాగుంటే మరల సంపాదన యోగం ఉంటుంది. ధనరేఖ స్పష్టంగా ఉంటే మంచి ఫలితాలుంటాయి. లేనిచో చెడు ఫలితాలుంటాయి.





కొందరి చేతులలో ఈ ధనరేఖ ముక్కలు, ముక్కలుగా ఏర్పడి ఉంటుంది. ఇలా ఉండటం చాలా ప్రమాదం. ఇలా ఉండటం వల్ల ఆ వ్యక్తి ఏవృత్తిలోను ఎక్కువకాలం నిలబడలేదు. ఆర్థిక ఇబ్బందులు, వృత్తిరీత్యా కష్టనష్టాలు ఎదుర్కొంటాడు. సర్వం పోగొట్టుకొనే ప్రమాదం ఉంది. వీరు జీవితంలో నిలబడటం చాలా కష్టం. బ్రతికినన్నాళ్ళు సమస్యలుంటాయి. కొద్దిరోజులు బాగుంటే మరికొద్ది రోజుల ఇబ్బందులు వస్తాయి. నిలకడ లేని ఆదాయం నిలకడలేని జీవితం ఉంటుంది వీరికి.

ఈ చేతిలో అదృష్ట రేఖ బాగుంది. దానికి తోడు అదృష్టరేఖ చివరి భాగం త్రిశూలం లాగా మూడు పాయలుగా చీలి ఏర్పడి ఉంది. ఇలా ఏర్పడి ఉండటం చాలా అదృష్టం. వీరికి ఆత్మవిశ్వాసం ధైర్యం, తెగింపు ఎక్కువ. బాగా శ్రమ చేస్తారు. డబ్బులు సంపాదిస్తారు. కీర్తిప్రతిష్ఠలు సంపాదిస్తారు. దైవబలం పొందుతారు. వీరు సంఘంలో మంచి పలుకుబడి, గౌరవం పొందుతారు. వీరికి వీరే సాటి. వీరి కార్యదీక్షయే వీరి గుర్తింపునకు అభివృద్ధికి కారణం.



కొందరి చేతులలో అదృష్టరేఖ ఉండదు. చాలా చేతులలో అదృష్టరేఖ ఉండదు. అంత మాత్రాన ఆ వ్యక్తి సంపాదించ లేడు అని చెప్పటానికి వీలు లేదు. మిగతా రేఖలు బాగుంటే అరచేయి బాగుంటే, గ్రహ స్థానాలు బాగుంటే ఆ వ్యక్తి కూడా ధనరేఖ లేకున్ననూ తన స్వంత తెలివితేటలతో కష్టపడి, సంపాదించే అవకాశం ధనవంతుడయ్యే అవ కాశం, భోగభాగ్యాలను అనుభవించే అవకాశం ఉంది. కాబట్టి ధనరేఖ అరచేతిలో లేదని భయపడవలసిన అవసరం లేదు. అయితే ధనరేఖ ఉండటంవల్ల స్వయంకృషివల్ల అభివృద్ధి ఉంటుంది.



## సూర్యరేఖ



సూర్యరేఖ లేదా రవిరేఖ అని పిలుస్తారు. ఇది ఉండటం చాలా అదృష్టం కాని ఈ సూర్యరేఖ కొన్ని లక్షల చేతులలో ఒకరిద్దరికే కనిపిస్తుంది. అందరి చేతులలో ఈ రేఖ ఉండదు.

ఈ రేఖను సూర్యరేఖ లేదా రవిరేఖ అని పిలుస్తారు. ఈ రేఖ అందరి చేతులలో ఉండదు. కొన్ని లక్షల చేతులలో ఎవరో ఒకరిద్దరికే ఈ సూర్యరేఖ ఉంటుంది. ఈ సూర్యరేఖ ఉన్ననూ అరచేయి కోమలంగా బాగా ఉంటేనే, గ్రహ స్థానాలు బాగా ఉంటేనే ఈ రేఖ మంచి ఫలితాలనిస్తుంది. లేని ఎడల ఎలాంటి ఉపయోగం జరగదు. ఈసూర్యరేఖ ఉన్నవారు ఏదో ఒక వృత్తిలో నెంబర్ వన్ స్థానానికి ఎదుగుతారు. సంపాదిస్తారు. పేరు, ప్రఖ్యాతులు సంపాదించుకొంటారు. నలుగురిలో గౌరవం ఉంటుంది. వీరు మంచి పనులు చేస్తారు. సమాజమునకు ఉపయోగపడ్తారు. గొప్పగొప్ప రాజకీయ నాయకుల హస్తములలో, మంచి నటులు, కళాకారులు, గాయకులు, రచయితలు, క్రీడాకారులు బాగా వ్యాపార రీత్యా అభివృద్ధి చెందినవారి చేతిలో ఈ సూర్యరేఖ ఉంటుంది.



ఈ భూమిపైన వీరు సూర్యునిలాగా వెలిగిపోతారు. సూర్యజాతకులు చాలా అందంగా, దర్పంగా, చూడటానికి బాగా ఆకర్షణీయంగా ఉంటారు. వీరికి మంచి ఆలోచనలు, మంచి ఆశయాలుంటాయి.

వీరు కీర్తిప్రతిష్టలు సంపాదించటం కోసమే పుడ్తారు. పేరు సంపాదించు కోవటమే కష్టపడుతారు. ఋజు మార్గంలో ప్రయాణిస్తారు. వీరికి ఆత్మాభిమానం, పట్టుదల, కార్యదీక్ష ఎక్కువ. కీర్తి ప్రతిష్ఠలే వీరి ప్రాణం. జీవితంలో వీరి ఆశయాలు కొరకు నిరంతరం శ్రమ చేస్తారు. ఆశయసిద్ధి కొరకు జీవితాన్ని త్యాగం చేస్తారు.

ఈ అరచేతిలో సూర్యరేఖ ఉంది. సామాన్యంగా ఈ సూర్యరేఖ కూడా ధనరేఖ వలె చంద్రస్థానం క్రింద భాగంనుండి, లేదా బుద్ధిరేఖ పైనుండి కాని ప్రారంభం అయి సూర్యస్థానం చేరుకొని నిలచిపోయి ఉంటుంది. అరచేయి బాగుండి ఈ సూర్యరేఖ కూడా స్పష్టంగా, చక్కగా, కాంతి వంతంగా ఉంటే అది మంచి ఫలితాల నిస్తుంది. అరచేయి మోటుగా, గట్టిగా ఉండి, సూర్యరేఖ ఉన్ననూ ఎలాంటి ఫలితము



లుండవు. ఏ రేఖైనా మంచిఫలితాలు ఇవ్వాలంటే అరచేయి కోమలంగా, అందంగా, మెత్తగా, కాంతివంతంగా, ఆకర్షణీయంగా ఉండాలి. సూర్యరేఖ ఉన్నవారు గొప్ప విద్యావంతులు కాగలరు.

సూర్యరేఖ ఉన్నవారు గొప్ప విద్యా వంతులు లేదా ఏదో ఒక వృత్తిలో గొప్ప పేరుప్రఖ్యాతులు సంపాదించు కొంటారు. ఈ అరచేతిలో సూర్యరేఖ బుద్ధిరేఖ నుండి ప్రారంభం అయింది. అందువల్ల ఈ వ్యక్తి దాదాపు 35 సం॥ల వయస్సునుండి స్వంత తెలివితేటలు, స్వంత ఆలోచనలు, శక్తి సామర్థ్యాలతో పైకి వస్తాడు. తన స్వంత తెలివితేటలతో మంచి విద్యావంతుడు అయి మంచి గుర్తింపు, పేరు, గౌరవం, ఆదాయం పొందుతాడు. సూర్యజాతకులు మంచికి,



ఋజు మార్గమునకు అంకితం అయిపోతారు. ఇతరులపై ఆధారపడరు. వారు ఎప్పుడు నెంబర్‌వన్ పొజిషన్‌నే కోరుకుంటారు. కాని నెంబర్ టు పొజిషన్‌లో ఉండటానికి ఇష్టపడరు. అనుకొన్నది సాధించుకొంటారు. రాజీ పడరు.

ఈ సూర్యరేఖ సన్నగా, పొడవుగా, స్పష్టంగా, కాంతివంతంగా ఉంది. ఇది సూర్యస్థానం వద్ద రెండు పాయలుగా చీలి ఉంది. ఇలా ఉండటం చాలా మంచిది. ఇలా ఉన్నపుడు ఆ వ్యక్తి మంచి విద్యా వంతుడు, ధనవంతుడు కూడా కాగలడు

మంచి పేరు, మంచి కీర్తి పొందుతారు. సంపాదించి భోగభాగ్యాలు అనుభవిస్తారు. ఇతరదేశాలు పర్యటించే అదృష్టం ఉంటుంది. వీరు విద్యలోకాని, కళలలో కాని గొప్ప గుర్తింపు పొందుతారు. సంపాదించుకొంటారు. ఈ సూర్యరేఖ రెండు చేతులలో కూడా చక్కగా ఉంటే ఆ వ్యక్తి సకల భోగభాగ్యాలు అనుభవిస్తాడు. సూర్యజాతకులకు కుటుంబ జీవితం చాలా బాగా ఉంటుంది.





సూర్యరేఖ ఇలా గొలుసులాగా ఏర్పడి ఉంటే చెడు జరుగుతుంది. ఇలాంటి వ్యక్తికి ఆలోచనా శక్తి ఉండదు. జీవితంపై ఆశలు, ఆశయాలుండవు. గమ్యంలేని జీవితం, అతి సామాన్యమైన జీవితం, ఉంటుంది. వీరు నీచమైన పనులు కూడా చేస్తారు. ఆర్థిక ఇబ్బందులు ఎదుర్కొంటారు. సంసార జీవితం సంతోషంగా ఉండదు. ఒక విధంగా వీరు పిచ్చివారు అయ్యే ప్రమాదం ఉంది. వీరికి అన్ని చెడు అలవాట్లు వస్తాయి. వీరితో స్నేహం చేసినవారు కూడా చెడిపోతారు.

ఈ సూర్యరేఖ స్పష్టముగా, కాంతి వంతంగా, ఉంటేనే మంచిది. కాని ఇందులో ఈ సూర్యరేఖ రెండు ముక్కలుగా ఏర్పడి ఉంది. అందువల్ల ఈ జాతకునికి పరిస్థితు లలో మార్పులు వస్తాయి. సడన్‌గా ఉన్న స్థితినుండి దిగజారిపోతాడు. అయినా తెలివి తేటలలో, మరల కృషిచేసి మంచి పొజిషన్‌కు చేరుకొంటాడు. సంపాదిస్తాడు సుఖపడుతారు. కీర్తి ప్రతిష్ఠలు సంపాదించుకొంటారు. పూర్వ వైభవం మరలవస్తుంది. చివరిజీవితం హాయిగా గడచిపోతుంది వీరికి.





ఈ అరచేయిలో సూర్యరేఖ హృదయ రేఖనుండి బయలుదేరి, సూర్యస్థానంలో చీలిపోయింది. ఇలా సూర్యరేఖ ఉన్నప్పుడు ఈ వ్యక్తి మొదట్లో సామాన్య జీవితం గడిపిననూ, చివరిదశలో అంటే దాదాపు 50 సం॥ల నుండి మంచి గుర్తింపు, పొందుతాడు. పేరు, డబ్బు, గౌరవ మర్యాదలు పొందుతాడు. చివరి దశ వీరికి అన్ని విధాల బాగుంటుంది. చివరిజీవితం హాయిగా, ప్రశాంతంగా, సుఖంగా గడచిపోతుంది. వీరు పదిమందికి ఉపయోగపడ్తారు. నలుగురికి మంచి మార్గం చూపించ గలుగుతారు.



ఈ చేతిలో సూర్యరేఖ శుక్రస్థానం నుండి బయలుదేరి రవిస్థానం చేరుకొని ఉంది. ఇలా ఉండటం అదృష్టమే. ఇలా ఉన్నప్పుడు ఆ వ్యక్తికి బంధువుల సహాయం వల్ల అభివృద్ధి పొందుతారు. కొందరికి స్నేహితుల సహాయం వల్ల అభివృద్ధి పొందుతారు. మరికొందరు వివాహం వల్ల కలిగిన సంతానంవల్ల కలసి వచ్చే అవకాశం ఉంది. వీరు ఇతరుల సహాయ సహకారాలవల్ల గొప్ప విద్యావంతులై మంచి పొజిషన్‌కు చేరు కొంటారు. మంచిపేరు సంపాదనను పొందుతారు.



ఈ చేతిలో సూర్యరేఖ చంద్రస్థానంలో బయలుదేరి సూర్యస్థానం చేరుకొంది. ఇలా ఉండటంవల్ల ఆ వ్యక్తి స్వస్థలం వదలి పరస్థానంలోనే స్థిరపడుతాడు. పరస్థానంలోనే కావలసినవారి సహాయంవల్ల మంచి అభివృద్ధి సాధించుకొంటారు. వీరు సంగీత విద్వాంసులుగా, గొప్ప కళాకారులుగా పేరు ప్రఖ్యాతులు, గొప్ప సంపాదనాపరులు అయ్యే అదృష్టం

ఉంటుంది. కొందరికి ఆకస్మిక ధనప్రాకప్తి పొందుతారు. వీరు చిన్నతనంలో పేదవారైననూ పరస్థానంలో ధనవంతులు అయ్యే అదృష్టం ఉంటుంది.

సూర్యరేఖ అరచేతిలో ఏర్పడి ఉంది అది సూర్యస్థానం చేరుకొన్న తర్వాత మూడు పాయలుగా త్రిశూలాకారంలో చీలి ఒకటి సూర్యస్థానం, ఒక పాయ బుధస్థానంలోనికి మరొక పాయ శనిస్థానంలోనికి చీలి ఉన్నట్లయితే అది చాలా మంచిది. ఇలా ఉన్నప్పుడు ఆ వ్యక్తి గొప్ప విద్యావంతుడు అవుతాడు. బాగా సంపాదన ఉంటుంది. మంచి పేరు ప్రఖ్యాతులు సంపాదిస్తాడు. వీరు సమాజంలో నెంబర్ 1. స్థానమునకు ఎదుగుతారు. వీరు బాగా శ్రమచేసి స్వంత కృషితో, స్వంత తెలివితేటలతో అభివృద్ధి సాధించుకొంటారు. వీరు అన్ని రంగములలో రాణిస్తారు.



సూర్యరేఖ ఇలా అరచేతిలో ఏర్పడి ఉండటం మంచిదికాదు. ఈ చేతిలో సూర్య రేఖ ముక్కలు, ముక్కలుగా ఏర్పడి ఉంది. అందువల్ల ఆ వ్యక్తి ఎంత తెలివితేటలు కలవాడు అయిననూ, ఎంత కృషిచేసిననూ, ఎన్ని మార్గములలో ప్రయాణం చేసినను అదృష్టం కలసిరాకపోవటం వల్ల అతని ప్రయత్నాలు అన్నియు వృధా అవుతాయి. జీవితంలో అనేకసార్లు అపజయం పాలు అవుతారు. అనుకొన్నది సాధించుకోలేరు. ప్రయత్నాలు విఫలం అవటంవల్ల కీర్తిప్రతిష్ఠలు పొందలేక అతి సామాన్యమైన జీవితం అనుభవిస్తారు. సంపాదనకూడా బాగుండదు. అదృష్టం కలసిరాక పోవటంవల్ల రాజీపడి బ్రతకవలసి వస్తుంది.



# బుధరేఖ



దీనిని బుదరేఖ లేదా ఆరోగ్యరేఖ అంటారు. అరచేయి బాగుండి, ఈ బుధరేఖ స్పష్టంగా ఉంటే ఆరోగ్యం, ఆదాయం చాలా బాగుంటుంది. ఆ వ్యక్తి వ్యాపారంలో బాగా సంపాదిస్తాడు.



ఈ రేఖను బుధరేఖ అంటారు. దీనిని ఆరోగ్యరేఖ అనికూడా పిలుస్తారు. అరచేయి రంగు బాగుండి. గ్రహస్థానములు బాగుండి ఈ ఆరోగ్యరేఖ స్పష్టంగా, లోతుగా, కాంతి వంతంగా, సవ్యంగా ఏర్పడి ఉంటే ఆవ్యక్తి ఆరోగ్యం బాగుంటుంది. ఎక్కువ కాలం బతుకుతాడు. వ్యాపారంలో బాగా సంపాదిస్తాడు. వీరికి వ్యాపారం బాగా కలసి వస్తుంది. వ్యాపారంలో సంపాదన బాగుంటుంది. వ్యాపారవృత్తిలో వీరు మంచిస్తాయికి ఎదుగుతారు. వ్యాపారంలో నెంబర్ వన్ స్థానమునకు ఎదుగుతారు. అయితే ఈ బుధరేఖ బుధస్థానం నుండి బయలుదేరి జీవితరేఖ దగ్గర, లేదా జీవితరేఖలో కలసి ఆగిపోయి ఉంటుంది. ఇలా ఏర్పడి ఉన్న ఈ రేఖను బుధరేఖ అని పిలుస్తారు. ఈ బుధరేఖ జీవితరేఖలో ఏ ప్రాంతంలో కలుస్తుందో ఆ వయస్సువరకు ఆ వ్యక్తి జీవించి ఉంటాడు. ఆ వయస్సుయే అతని జీవితకాలం క్రింద గుర్తింపబడుతుంది. బుధజాతకులు పొట్టిగా, లావుగా, హుషారుగా ఉంటారు. వీరికి గొప్ప మాటకారితనం ఉంటుంది. మాటలు చెప్పటంలో, వ్యాపారం చేయటంలో వీరికి వీరేసాటి. వ్యాపారం బుధజాతకులకు కలసి వచ్చినట్లు ఇతరులకు అంతగా కలసిరాక పోవచ్చును. ఈ రేఖ స్పష్టంగా, కాంతివంతంగా ఉంటే, అరచేయి కోమలంగా, గ్రహస్థానములు బాగుంటే ఆ వ్యక్తి వ్యాపారంలో బాగా సంపాదిస్తాడు. వీరు మంచికార్యములు, దానధర్మములు, దైవకార్యక్రమములు చేస్తారు. అదృష్టం బాగా కలసివస్తుంది. బుధజాతకులు వ్యాపారంలో నష్టపోయినా తిరిగి సంపాదించగలరు. వ్యాపారమే వీరి ప్రాణం. వ్యాపారం బాగా కలసివస్తుంది. వీరికి ఆరోగ్యం అంతగా బాగుండదు.

ఈ రేఖను బుధరేఖ, వ్యాపారరేఖ అని కూడా పిలుస్తారు. ఈ రేఖ బాగుంటే ఆ వ్యక్తికి ఆరోగ్యం బాగుంటుంది. వ్యాపారంలో, చేయు వృత్తిలో బాగా కలసివస్తుంది. వీరికి మంచి సంపాదన, పొజిషన్ ఉంటుంది. వీరు వ్యాపారరీత్యా, లేదా డాక్టర్లుగా, లాయర్లుగా, నటులుగా, బ్రోకర్లుగా సంపాదించవచ్చును. వీరి తెలివితేటలు వీరికి వృత్తిరీత్యా బాగా లాభం చేస్తాయి. సంపాదిస్తారు.

సుఖపడుతారు. వీరికి కుటుంబ జీవితం బాగుంటుంది. వీరు భోజన ప్రియులు. రెండు చేతులలో బుధరేఖ బాగుంటే సంపాదన చాలా బాగుంటుంది.





ఈ బుధరేఖ ఇలా గొలుసులాగా ఏర్పడి ఉండి అరచేయి మోటుగా ఉంటే మంచిదికాదు. అవ్యక్తికి ఆరోగ్యం బాగుండదు. వ్యాపారం కలసిరాదు. ఏవృత్తి చేసినా కలసిరాదు. ఆర్థిక ఇబ్బందులు, మానసిక ఇబ్బందులు ఎదుర్కొంటారు. ప్రతీరోజు ఒక యుగంలా గడుస్తుంది. పేరు ప్రఖ్యాతులులేని, పేదరికముతో అతి సామాన్యమైన జీవితంతో బాధలు పడ్తారు. దురదృకష్టము వీరిని అనేక రకములుగా ఇబ్బందులు పెడ్తుంది. కొందరు పరిస్థితులు బాగాలేని వారు కుటుంబానికి దూరం కూడా అవుతారు. అనారోగ్య వీరిని పట్టి పీడిస్తుంది. అందువల్ల ఈ రేఖ చాలా రకాలుగా ఇబ్బందులనే తెచ్చిపెడ్తుంది.

ఈ బుధరేఖ కూడా అందరి చేతులలో కన్పించదు. కొందరి చేతులలో మాత్రమే ఉంటుంది. అయితే బుధరేఖ ఉన్నవారు వ్యాపారమే చేస్తారని కాదు. వ్యాపారంలేదా సంపాదనకు అవకాశం ఉన్న వృత్తులులో బాగా సంపాదించే అవకాశం ఉంది. వీరు ఆరోగ్య విషయంలో జాగ్రత్తగా ఉండటం అవసరం. ఈ చేతిలో బుధరేఖ బుద్ధిరేఖలో నుండి ప్రారంభం అయింది. అందువల్ల ఈ



వ్యక్తి మొదట్లో సంపాదించలేక పోయిననూ 35 సం॥ల వయస్సునుండి బాగా సంపాదించుకొనే అవకాశం, సుఖపడే యోగం ఉంటుంది. బుధజాతకులు కళాకారులుగా కూడా, డాక్టర్లుగా కూడా బాగా సంపాదించ గలరు.

ఈ చేతిలో బుధరేఖ ముక్కలు, ముక్కలుగా ఏర్పడి ఉంది. అందువల్ల ఈ వ్యక్తి వ్యాపారంలో చాలాసార్లు నష్టపోతాడు. ఆరోగ్యం అంతగా బాగుండదు. ఏ వృత్తిలోను వీరు నిలకడగా ఉండలేరు. అందువల్ల ఆర్థిక ఇబ్బందులు, అనారోగ్యం, అశాంతి పొందుతారు. అరచేతిలో ఏ రేఖ కూడా ఇలా ముక్కలు, ముక్కలుగా ఉండటం మంచిది కాదు. రేఖలు బాగుంటే మంచి ఫలితాలుంటాయి. రేఖలు బాగా లేకుంటే చెడు ఫలితాలుంటాయి. అరచేయి బాగుంటేనే రేఖలు మంచి ఫలితాలనిస్తాయి.



## కుజరేఖ

దీనిని కుజరేఖ లేదా రెండవ జీవితరేఖ అంటారు. ఈ రేఖకూడా అందరి చేతులలో కన్పించదు. ఈ రేఖ కేవలం కొందరి చేతులలోనే ఉంటుంది. ఈ రేఖ జీవితరేఖ లోపలి భాగంలో జీవితరేఖ లాగా ఏర్పడి ఉంటుంది. ఇలా ఉండటం చాలా అదృష్టం. ఇలా ఉంటే ఆ వ్యక్తి ఆరోగ్యం చాలా బాగుంటుంది. ఆదాయం బాగుంటుంది. వీరు చాలా చురుకుగా ఉంటారు. వీరికి ఎలాంటి అనారోగ్యం రాదు. వచ్చినా వెంటనే పోతుంది. వీరికి ఆరోగ్యం, ఆదాయం, పరిస్థితులు చాలా బాగుంటాయి. వీరికి ఎలాంటి కష్టనష్టములు రావు. వచ్చినా



వెంటనే కోలుకోగలరు. ఈ కుజరేఖ అరచేతిలో ఉన్నవారు జీవితంలో చాలా తొందరగా, తక్కువకాలంలో ఎక్కువ అభివృద్ధి సాధించుకొంటారు. వీరికి ఆత్మవిశ్వాసం ఎక్కువగా ఉంటుంది. ఎలాంటి కష్టమైన పనులనైనా శ్రమించి సాధించుకొంటారు. వీరికి ఇతరులవల్ల ఎలాంటి హాని జరగదు. వీరి సంతానం కూడా మంచి ఆరోగ్యవంతులు అవుతారు. వీరికి ఆదాయం, కుటుంబ జీవితం హాయిగా ఉంటుంది. వీరు తలపెట్టిన పనిలో తప్పనిసరిగా విజయాలు సాధించుకొంటారు. ఓటమిని అంగీకరించరు. పరిస్థితులకు రాజీపడరు. అనుకొన్న పనిని సాధించేవరకు నిద్రపోరు. వీరు అభివృద్ధి చెందటంలో ఎల్లప్పుడు మొదటి స్థానంలోనే ఉంటారు. వీరు ఇతరులకు కూడా సహాయం చేస్తారు. వీరికి మంచి ఆశలు, ఆశయాలు, ప్రవర్తన ఉంటాయి. వీరు సాటివారికి మేలు చేస్తారుకాని కీడు చేయరు.

## వివాహ రేఖలు

అరచేతిలో చిటికన వ్రేలు క్రింద బుధస్థానంలో ఆత్మరేఖకు పై భాగంలో అరచేయి అంచున ప్రారంభంఅయి బుధస్థానం వైపు ఏర్పడి ఉంటే ఈ చిన్న రేఖలను వివాహరేఖలు అంటారు. ఈ వివాహ రేఖ కూడా పొడవుగా, స్పష్టంగా, లోతుగా, కాంతివంతంగా ఏర్పడి ఉంటే ఆ వ్యక్తికి వివాహం అవుతుంది. మంచి భార్య లభిస్తుంది. వివాహ జీవితం బాగుంటుంది. దాంపత్య జీవితంలో సుఖశాంతులుంటాయి. అయితే చాలా రేఖలుంటే చాలా వివాహాలు జరుగుతాయి అనేది నిజంకాదు. సామాన్యంగా ఈ స్థానంలో ఒకటి, రెండు రేఖలు కన్పిస్తూ ఉంటాయి. స్పష్టమైన వివాహరేఖ ఉంటే ఆ



రేఖ కాలపరిమితిలో వివాహం అవుతుంది. ఈ వివాహరేఖ స్పష్టంగా లేకపోతే సంబంధాలు రావచ్చును కాని వివాహం జరగదు. వివాహరేఖ ముక్కలు అయినా, వివాహరేఖ ఆత్మరేఖ వైపు వంగిపోయినట్లు ఉన్నా, వివాహరేఖ ముందుభాగం

రెండు పాయలుగా చీలిఉన్నా దంపతులు విడిపోయే ప్రమాదం, లెదా ఒకరికి ఒకరు దూరం అయ్యే సూచనలుంటాయి. అందువల్ల ఎవరైనా సుఖంగా, సంతోషంగా, సంతృప్తిగా ఉండాలంటే ఆత్మరేఖ మరియు ఈ వివాహరేఖ స్పష్టంగా బలంగా పూర్తిగా చక్కగా ఏర్పడి ఉండాలి. అప్పుడే వారి దాంపత్యజీవితం హాయిగా, సంతోషంగా, సుఖశాంతులతో నిండిఉంటుంది. వారు సుఖపడుతారు. భోగభాగ్యాలను అనుభవిస్తారు. అందువల్ల ఈ వివాహరేఖ స్పష్టంగా, సవ్యంగా, ఏర్పడి ఉంటే చాలా మంచిది. వివాహరేఖ బాగున్నవారి జీవితం బాగుంటుంది. సంతోషంగా ఉండగలుగుతారు. ఎక్కువ రేఖలున్నంత మాత్రన ఎక్కువ వివాహాలు జరగవు. ప్రమాదాలు, పరిచయాలు జరగవచ్చును అంతే.

ఇలా బుధస్థానం క్రింద అరచేయి అంచున ఏర్పడిన చిన్న, చిన్న రేఖలను వివాహ రేఖలు అంటారు. సామాన్యంగా ఈ రేఖలు ప్రతీవ్యక్తి చేతిలో ఉంటాయి. ఈ వివాహరేఖ లేనట్లయితే అరచేయి వెూటుగా, అతి చిన్నదిగా ఉంటే ఆ వ్యక్తికి వివాహ కాకపోవ చ్చును. వివాహం అయినా ఆ దంపతులు విడిపోయే ప్రమాదం ఉంది. ఈ బొమ్మలో వివాహరేఖ స్పష్టంగా ఒకటే ఏర్పడిఉంది. ఈ వ్యక్తికి సకాలంలో మంచి వివాహం అవు తుంది. దంపతులు సుఖశాంతులతో హాయిగా కలసి ఉంటారు. సుఖపడుతారు. సంతోషంగా కలసి జీవిస్తారు.



ఈ అరచేయిలో రెండు వివాహరేఖ లున్నాయి. అంత మాత్రాన రెండు వివాహాలు జరగవు. ఒక సంబంధం తెగిపోయి మరొక సంబంధం కుదురుతుంది. కొన్ని సందర్భాలలో ఇతరులతో పరిచయాలు జరగవచ్చును. అంతేకాని రెండు వివాహాలు జరగవు.



పరిచయాలుకూడా కొద్ది కాలమే ఉంటాయి కాని ఎక్కువ కాలం నిలవవు. ఒక వ్యక్తితోనే జీవిత కాలం సంబంధం ఉంటుంది.



ఈ చిత్రంలో వివాహరేఖ ముక్కలుగా ఏర్పడి ఉన్నది. ఇలా ఉండటం మంచిది కాదు. ఇలా ఉన్నప్పుడు అరచేయి కూడా మోటుగా, ఉండి ఆత్మరేఖ కూడా చాలా చిన్నదిగా ఉంటేవారికి వివాహం కావటం చాలా కష్టం. వివాహం ఆలస్యంగా జరిగే అవకాశం ఉంది. వివాహం అయినా వారు కలసి ఉండలేరు. సంతోషంగా ఉండలేరు. విడిపోయే ప్రమాదం ఉంది. వీరి జీవితంలో ఆనందం, సుఖశాంతులుండడం చాలా కష్టం.



అరచేతిలో వివాహరేఖ స్పష్టంగా ఉంటే వివాహం అవుతుంది. కాని ఈ వివాహరేఖ ముందు భాగం ఇలా రెండు పాయలుగా చీలి ఉండటం మంచిదికాదు. ఇలా ఉంటే, ఆత్మరేఖ కూడా చాలా చిన్నదిగా ఉంటే ఆ దంపతులు విడిపోతారు. కలసి ఉండటం చాలా కష్టం. కలసి ఉన్న రోజు గొడవలు పడుతారే కాని సంతోషంగా ఉండలేరు. వివాహరేఖ బాగుంటేనే కాపురం హాయిగా ఉంటుంది. ఈ వివాహరేఖ బాగా లేనట్లయితే జీవితంలో సుఖశాంతులుండవు. మనసు చంపుకొని, రాజీపడి బ్రతకవలసి వస్తుంది.

# శుక్రచాపము

ఈ రేఖను శుక్రచాపము లేదా శుక్రవంక అని పిలుస్తారు. ఈ శుక్రవంక అందరి చేతులలో కన్పించదు. కొందరి చేతులలోనే కన్పిస్తుంది. ఇది ఉండటం వల్ల లాభం కన్నా నష్టములు ఎక్కువ. అందువల్ల ఈ రేఖ అరచేతిలో ఉండక పోవటమే చాలా మంచిది. ఈ రేఖ బుధుని వ్రేలు దగ్గరి ప్రాంతంలో అర్థచంద్రాకారంలో ఏర్పడి శనివ్రేలు క్రింది వరకు చంద్రుని ఆకారంలో ఏర్పడి ఉంటుంది. కొందరి చేతులలో ఈ రేఖలు రెండు ఒకదాని క్రింద ఒకటి ఏర్పడి ఉంటాయి. ఈ రేఖలున్న వారికి మంచి తెలివితేటలుంటాయి. రాజభోగాలు అనుభవిస్తారు. రాజులాగా బ్రతుకుతారు అని అంటారు. కాని ఈ శుక్రవంక అరచేతిలో ఉండకపోవటమే మంచిది. ఇది ఉండటంవల్ల సెక్స్‌కోరికలు ఎక్కువగా ఉండే ప్రమాదం ఉంది. రెండు శుక్రవంకలు ఏర్పడి ఉంటే వీరికి అక్రమ సంబంధాలు ఏర్పడుతాయి. శుక్రస్థానంలో చతురంగపాళి గుర్తు ఏర్పడి ఉండి చంద్రస్థానం ఎత్తుగా ఉంటే వ్యభిచరించే ప్రమాదం, చెడు స్నేహాలు, అలవాట్లకు బానిసలు అయ్యే ప్రమాదం ఉంది. అందువల్ల వీరు వీరి జీవితంలో డబ్బు, స్థిరాస్థులు, సర్వం కోల్పోయే ప్రమాదం ఉంది. కావున ఏ వ్యక్తికి కూడా ఈరేఖ ఉండటంవల్ల లాభంకన్నా చెడుయే ఎక్కువగా జరిగే ప్రమాదం ఉంది. అందువల్ల ఈ శుక్రవంక గుర్తు అరచేతిలో ఉండకపోవడం వల్లనే లాభం. లేనప్పుడే మనిషి జీవితం హాయిగా, సంతోషంగా ఉంటుంది.



# యోగరేఖ

అరచేతిలో చంద్రస్థానంలో అర్థచంద్రాకారంలో ఏర్పడి ఉన్న రేఖను యోగరేఖ, దివ్యరేఖ అని పిలుస్తారు. ఈ రేఖ సామాన్యంగా కొన్ని లక్షలమంది చేతులు చూసినను ఈ యోగరేఖ కన్పించదు. సామాన్యంగా ఈ రేఖ కన్పించటం చాలా కష్టం. అయితే ఈ రేఖ ఉన్నవారికి దివ్యజ్ఞానం, దివ్యదృష్టి, భవిష్యత్తును ఊహించే శక్తి, దైవబలం, దైవసహాయం ఉంటుంది అంటారు పెద్దలు.



యోగులు, సన్యాసులు, బాబాలు, మతప్రవక్తలు, మంత్ర విద్యలు తెలిసిన వారి చేతులలో ఈ రేఖ ఉండవచ్చును. ఈ రేఖ ఉన్నవారికి భగవంతునిపై నమ్మకం, భగవంతుని అనుగ్రహం, దైవశక్తి, దైవానుగ్రహం, ఉంటుంది అంటారు. వీరు సామాన్యంగా ఒంటరి జీవితం గడుపుతారు. వీరు సమాజం కొరకు పాటుపడ్తారు. సమాజమునకు సేవచేస్తారు. జీవితంలో భగవంతుని అనుగ్రహం పొందటం కొరకు, అతీత శక్తులు సంపాదించటం కోసం, లోకకళ్యాణం కొరకు తమ జీవితాలను ధారపోస్తారు. వీరివల్ల మేలు జరుగుతుంది కాని కీడు జరగదు. వీరు ఇతరులకు మేలు చేయటాన్ని తమ సుఖసంతోషాలు వదులుకొంటారు. సన్యాసులుగా, ఒంటరి జీవితం గడుపుతారు. సమాజసేవయే వీరి ఆశయం. వీరికి ఎలాంటి కోరికలు ఉండవు. వీరు సర్వసంగ పరిత్యాగులు. త్యాగం కొరకు వీరు వీరి జీవితాన్ని బలి ఇవ్వగలరు.





సామాన్యమైన జీవితం లభించే హస్తము



మధ్యరకమైన జీవితంపొందే హస్తము



సంపాదనకు అవకాశం ఉన్న హస్తము

అభివృద్ధి చెందే హస్తము



**బాగా డబ్బు పలుకుబడి సంపాదించే హస్తము**

**స్వయం కృషిపై అభివృద్ధి సాధించుకొంటారు**



**మంచి సంపాదన, పలుకుబడి, పేరు ప్రఖ్యాతులు**

**సంపాదించే హస్తము**



గమ్యంలేని నిత్యదరిద్రుడి హస్తము.



**అనేకచోట్ల రేఖలు విరిగి ఉన్న హస్తము. వీరి జీవితం కొద్ది రోజుల బాగుంటే కొద్ది రోజులు బాగుండదు.**



అస్తవ్యస్తంగా అనేక రేఖలున్న హస్తము. వీరి జీవితాన్ని నిర్ణయించటం చాలా కష్టం.



లాటరీటికెట్ లాంటి హస్తము. బాగా సంపాదించగలరు.

పోగొట్టుకొనే ప్రమాదం ఉంది.



మూడు రేఖలు ఒకేచోటినుండి ప్రారంభం అయినట్లు కన్పిస్తున్న హస్తము. ఆలోచనా రహితంగా తీసుకొనే నిర్ణయాలు వీరి జీవితాన్ని బలి తీసుకుంటాయి.

# ముఖము

ప్రతి మనిషియొక్క స్థితికిని, గతికిని మనోభావములే కారణములు. మనిషి ముఖ లక్షణములను బట్టియు కొన్ని ఫలితములు చెప్పవచ్చును. కొందరి ముఖములో గొప్ప తేజస్సు, ఆకర్షణ, ఎదుటివాళ్ళని సమ్మోహనపరిచే శక్తి ఉంటుంది. వారిని చూడగానే ఒక రకమైన గౌరవభావం ఏర్పడుతుంది. వారి చూపులకు, మాటలకు, చేతలకు ఎలాంటి వారైనా కట్టుబడి పోతారు. దీనిని కొందరు ఫేస్ వాల్యూ అంటారు. ఫేస్ వాల్యూతో ప్రపంచములో గొప్పవారయినవారు, గొప్ప అదృష్టం పొందినవారు కూడా చాలా మంది ఉన్నారు. ఇది భగవంతుడు మనిషికి ఇచ్చిన గొప్పవరం. దీనిని మనం బజారులో డబ్బులు ఇచ్చి కొనలేము. భగవంతుడు కొందరికి కొన్ని ప్రత్యేకతలు ప్రసాదిస్తూ ఉంటాడు. కొందరికి ఇతరులను ఆకర్షించగల అందమైన, ఆకర్షణీయమైన ముఖం, మరికొందరికి, ఆకర్షణీయమైన నిండైన విగ్రహము (శరీర ఆకారము), మరికొందరికి కంఠము కొందరికి తెలివితేటలు ఇలా ఎన్నో ప్రత్యేకతలు కొందరిలో మాత్రమే ఉంటాయి.

ముఖము మనోదర్పణము అని అందరికీ తెలుసు. మనిషి దిగులుగా ఉన్నాడా, సంతోషంగా ఉన్నాడా, ఆలోచనలో నిమగ్నమై ఉన్నాడా, విచారంగా ఉన్నాడా ఇలా ఎన్నో విషయాలు మనిషి ముఖం చూడగానే గ్రహించవచ్చును.

ఈ ప్రపంచములో బుద్ధిని బోలిన బుద్ధి, మతమును బోలిన మతం లేదు, గుణములు బోలిన గుణం లేదు అలాగే ముఖమును బోలిన ముఖంలేదు. కొన్ని విషయాలోల పోలికలుంటాయి. అలాగే ముఖములులలో కూడా కొన్ని పోలికలు ఉన్నాయి. ఈ ముఖములలో కొన్ని భాగాలు ఉన్నాయి.

(1) గుండ్రని ముఖము

(2) చతురస్రాకారపు ముఖము

(3) కోలముఖము

## గుండ్రని ముఖము

కొందరి ముఖములు గుండ్రముగా బంతిలాగా ఉంటాయి. అయితే ఇలా గుండ్రముగా ముఖము ఉన్నవారిలో కొన్ని ప్రత్యేకతలున్నాయి. గుండ్రని ముఖము గలవారు చూడటానికి అందంగా కనిపిస్తారు. వీరు అందరితో కలసిపోగలుగుతారు. అందరితో స్నేహం చేస్తారు. అందరితో హాయిగా కలసి ఉంటారు. వారు ఎల్లప్పుడు సంతోషంగా ఉంటారు. సంతోషంగా ఉండటానికి



ప్రయత్నిస్తారు. సామాన్యంగా వీరు విచారంతో కన్పించటం కష్టం. వీరు అధ్యాత్మిక విషయాలలో, శాస్త్ర విషయాలలో, శ్రద్ధ చూపించరు. జీవితంలో ప్రతీరోజు ఆనందంగా, సుఖసంతోషాలతో, విలాసవంతమైన జీవితం గడపాలని కోరుకొంటారు. అలాంటి జీవితం పొందటానికి ప్రయత్నిస్తారు. వీరికి సంతోషమే ముఖ్యం. వీరిలో కొందరు రాజకీయనాయకులుగా, పెద్దపెద్ద ఉద్యోగస్థులుగా, వ్యాపారస్థులుగా డబ్బును, పలుకుబడిని, గౌరవమును సంపాదించుకొని జీవిస్తారు. వీరు సంసార జీవితం కొరకు, నిత్య అవసరాలకు, సాంఘిక జీవనం కోసం పాటుపడ్తారు కాని ఇతర విషయాలపై మనసు లగ్నం చేయరు. జీవితంలో అవసరాలు గడిచి సుఖంగా ఉండటానికే ఇష్టపడుతారు. తాము సంతోషంగా ఉంటారు. ఎదుటి వారు సంతోషంగా ఉండాలని కోరుకుంటారు.

## చతురస్రాకారపు ముఖము

కొందరి ముఖములు చతురస్రాకారపు ఆకారములలో ఉంటాయి. అందువల్ల ఈ ముఖమును చతురస్రాకారపు ముఖం అంటాము. అంటే దాదాపు పొడవు, వెడల్పు సమాన కొలతలుగల ముఖం. వీరు చూడటానికి శాంత స్వభావులుగా ఉంటారు. నిజానికి కూడా వీరు శాంతస్వభావులే. ఆచరణకు



అవకాశం ఉన్న పనులు గురించే ఆలోచిస్తారు. న్యాయమైన, ధర్మమైన, ఆచరణకు వీలు అయిన పనులు గురించి ఆలోచిస్తారు. చేస్తారు.వీరిలో పనిచేయాలని, సాధించాలని పట్టుదల ఉంటుంది. పనిచేస్తారు. ప్రారంభించిన పనిని పూర్తి చేస్తారు. సాధించుకొంటారు. వీరు తాము చెప్పదలచుకొన్న విషయాన్ని నిర్మొహమాటంగా చెప్తారు. మనసులో ఒకమాట, పైకి ఒకమాట మాట్లాడరు. వీరిలో మంచి ప్రవర్తన, మంచి అలవాట్లు, ఆలోచన, ఆచరణ ఉంటాయి. నలుగురిని దృష్టిలో ఉంచుకొని మసులుకొంటారు. మంచి అలవాట్లు గలిగి మంచి పనులు చేస్తారు. సామాన్యంగా వీరి లైఫ్ సాఫీగా సాగిపోతుంటుంది. వీరు ఆధ్యాత్మిక విషయాలలో కూడా శ్రద్ధవహిస్తారు. వీరు జీవితంపై మంచి అభివృద్ధి సాధించుకొంటారు. మంచి లైఫ్ అనుభవిస్తారు. గాలిలో ఆలోచనలు చేయటం, గాలిలో మేడలు కట్టడం, ఆచరణకు వీలుకాని విషయాలగురించి,

ఆలోచించటం ప్రయత్నించటం వీరికి ఇష్టముండదు. ప్రాక్టికల్‌గా ఆలోచిస్తారు. ప్రాక్టికల్ లైఫ్‌నే కోరుకొంటారు. అందువల్లే వీరి జీవితం బాగుంటుంది. వీరి సంసారజీవితం హాయిగా గడుస్తుంది. వీరికి ఎలాంటి సమస్యలు, కష్టాలు రావు. వస్తే వాటిని పరిష్కరించుకోగలుగుతారు. వీరు భూమి మీద నిలబడాలని కోరుకొంటారు కాని ఆకాశంలో విహరించాలని, పడి పళ్ళు ఊడకొట్టుకోవాలని కోరుకోరు. వారికి కావలసింది నిజం, ఆచరణకు యోగ్యమైన ప్రణాళికలు మాత్రమే.

## కోలముఖము

కోలముఖం కలవారు మంచి ఆలోచనా శక్తి, తెలివితేటలు, మంచి గ్రహణశక్తి, ఊహాశక్తి కలిగి ఉంటారు. తెలివితేటలలో వీరికి వీరే సాటి కాని వీరు ఆలోచిస్తారు, ఊహిస్తారు, గాలిలో మేడలు కడ్తారు. కాని క్రియచేయరు.



వీరు ఎంతైతే ఆలోచిస్తారో అంత పనిచేయరు ఇదే వీరి బలహీనత. శారీరకంగా పనిచేయలేరు. వీరు సూక్ష్మగ్రాహులు. వీరికి ఓర్పు, ఆత్మవిశ్వాసం తక్కువ. కోపం ఎక్కువ. చిఱుబుఱులాడుచుందురు. పని చేయలేరు కాని ఎదుటివారికి చక్కని సలహాలు ఇవ్వగలరు. వీరికి తెలివితేటలు ఎక్కువ. వీరు ఆలోచిస్తారు కాని

శ్రమ చేయలేరు. ఓర్పు ఉండదు. అందువల్ల వీరికి ఆర్థిక ఇబ్బందులు, మానసిక ఇబ్బందులు ఎక్కువే. వీరికి సంసార జీవితం కూడా అంత సవ్యంగా ఉండదు. వీరు లోకానికి సలహాలు ఇస్తారు కాని ఆచరణలో పెట్టలేరు. ఎదుటివారి గురించి ఆలోచిస్తారు కాని తమ జీవితాన్ని సరిదిద్దుకోవటానికి ప్రయత్నించరు. ఇదే వీరి బలహీనత.

# నిఘంటువు

1. అరచేయిలో రంగు, ఆకారం, చేతిలో గ్రహస్థానాలు, స్పష్టమైన కాంతివంతమైన సుదీర్ఘమైన రేఖలు ఉన్నప్పుడే ఆ జాతకుని జీవితం బాగుంటుంది.
2. అరచేయిలో రంగు, అరచేయి ఆకారం, చేతిలో గ్రహస్థానాలు, రేఖలు బాగా లేనట్లయితే ఆ జాతకుని జీవితం బాగుండదు.
3. పొట్టి రేఖలు చెడు ఫలితాలను ఇస్తాయి. దీర్ఘమైన రేఖలు మంచి ఫలితాలను, పూర్తి ఫలితాలనిస్తాయి.
4. అరచేయి గట్టిగా, మరీ పొట్టిగా, పొట్టివ్రేళ్ళు, అతి చిన్నది అయిన బ్రొటనవ్రేలు, పాలిపోయిన హస్తము దరిద్రము.
5. మెత్తని, గులాబిరంగు కలిగిన అరచేయి ఆకారం బాగుండి, వ్రేళ్ళు సామాన్య పొడవు కలిగి, స్పష్టమైన రేఖలు ఉన్న హస్తము మంచి ఫలితాలనిస్తుంది.
6. మరీ పొడవు గల హస్తం, మరీ పొడవుగల వ్రేళ్ళు ఉండటం అంత మంచిది కాదు. వీరు ఎక్కువగా ఆలోచిస్తారు కాని ఆలోచనకు తగ్గ క్రియ చేయరు. అందువల్ల వీరు జీవితంలో సరియైన అభివృద్ధి సాధించలేరు.
7. అరచేయి మధ్యస్థమైన పొడవు కలిగి, అరచేయి ఆకారం, వ్రేళ్ళ ఆకారం బాగుండి అరచేయి రంగు, అరచేతిలోని గ్రహస్థానాలు బాగుండి, స్పష్టమైన, దీర్ఘమైన రేఖలు ఉంటే మంచి ఫలితాలుంటాయి.
8. అరచేతిలో తక్కువ రేకలున్నవారి జీవితం సామాన్యంగా, సుఖంగా, సంతోషంగా ఉంటుంది.
9. అరచేతిలో ఎక్కువ రేఖలుండటం వల్ల, ఎక్కువ పనులు, వ్యాపకాలవల్ల అభివృద్ధి ఉంటుంది కాని, సరియైన సుఖశాంతులుండవు. సంపాదన, గుర్తింపు ఉంటుంది కాని విశ్రాంతి ఉండదు.

10. అరచేయి ఆకారం బాగుండి, అరచేయిలో బుద్ధిరేఖ, సూర్యస్థానం, సూర్య రేఖ బాగుండి, ఆ వ్యక్తి 1, 10, 19, 28 తేదీలలో, ఆదివారం రోజు పుట్టి ఉంటే ఆ వ్యక్తి గొప్ప విద్వాంసుడు, లేదా గొప్ప కళాకారుడు అయి మంచి ఉన్నత స్థానంలో ఉండి మంచి కీర్తి ప్రతిష్టలు, సంపాదన, గౌరవమర్యాదలు పొందుతారు. వీరు మంచి మార్గంలో ప్రయాణం చేస్తూ నలుగురికి మంచి మార్గం చూపిస్తారు.

11. అరచేయిలో రంగు, రేఖలు, బాగుండి, బుద్ధిరేఖ, చంద్రస్థానం బాగుండి, ఆ వ్యక్తి 2, 11, 20, 29 తేదీలలో, సోమవారం రోజున పుట్టి ఉంటే ఆ వ్యక్తి గొప్ప కళాకారుడుకాని, గొప్ప వ్యాపారస్థుడుకాని అయి సంపాదన, సుఖశాంతులు పొందుతారు. వీరికి ఆలోచనా శక్తి తెలివితేటలు, అదృష్టం ఎక్కువ. వీరికి మంచి మనసు, ప్రేమించే గుణం, ప్రేమింపబడే అదృష్టం ఉంటాయి. వీరు ప్రేమించినవారి కొరకు సర్వం త్యాగం చేయగలరు. కాని వీరు ఎక్కువగా ప్రేమలో విఫలం అవుతుంటారు. వీరు వీరి జీవితంలో సుఖపడగలరు కాని మానసిక ఇబ్బందులు తప్పవు.

12. అరచేతిలో రేఖలు స్పష్టంగా ఉండి, బుద్ధిరేఖ, లైఫ్ లైన్ బాగుండి, అరచేతిలో గురుస్థానము కూడా బాగుండి, వీరు 3, 12, 21, 30 తేదీలలో, గురువారం రోజున పుట్టి ఉంటే వీరు గొప్ప విద్యావంతులు అయి, మంచి ఉన్నతమైన స్థానంలో ఉంటారు. వీరు ఏ స్థానంలో ఉన్నా నెంబర్‌వన్ పొజిషన్‌లో ఉంటారు. వీరు ఉద్యోగరీత్యా, లేదా రాజకీయాలలో రాణించగలరు. పేరు ప్రతిష్ఠలు సంపాదించగలుగుతారు. వీరు పేరు ప్రతిష్ఠల కొరకు ఎంత శ్రమైనా చేస్తారు. ఓటమిని అంగీకరించరు. వీరికి సంసార జీవితం హాయిగా గడుస్తుంది. వీరి స్నేహం పొందగలిగిన వారు అదృష్టవంతులు.

13. అరచేతిలో రేఖలు స్పష్టంగా ఉండి, సూర్యస్థానం, రాహుస్థానం బాగుండి, వీరు 4, 13, 22, 31 తేదీలలో, ఆదివారం రోజున జన్మించిఉంటే వీరు ఇంజనీర్లుగా, మంచి టెక్నిషియన్‌గా, పోలీస్ ఆఫీసర్లుగా రాణించగలరు. వీరికి జీవితంలో కష్టనష్టా లుంటాయి. వీరికి వివాహ జీవితం అంత సంతృప్తికరంగా ఉండదు. రాజీపడగలిగితేనే జీవితం బాగుంటుంది. రాజీపడక తప్పదు.

14. అరచేయి పొడవు, వెడల్పు సమానంగా ఉండి, అరచేయిలో బుధస్థానం బాగుండి, స్పష్టమైన బుధరేఖుండి, ఆ వ్యక్తి 5, 14, 23 తేదీలలో బుధవారం

రోజున గనుక పుట్టిఉంటే వారు విద్యావంతులు అయ్యే యోగం ఉంటుంది. వీరు డాక్టర్లుగా, వ్యాపారస్థులుగా మంచి పేరు ప్రఖ్యాతులు, మంచి సంపాదన పొందే అవకాశం ఉంది. వీరు అనుమానం, అపనమ్మకం వదలి ధైర్యం చేస్తే మంచి గుర్తింపు, మంచి సంపాదన పొందగలుగుతారు. ఎలాంటి కష్టంనుండి అయినా బయట పడగలుగుతారు.

15. అరచేతిలో శుక్రస్థానం, చంద్రస్థానం బాగుండి, స్పష్టమైన, దీర్ఘమైన ధనరేఖ కనక ఏర్పడి ఉంటే వీరు ధనవంతులు ఇండ్లలో పుడ్తారు లేదా అదృష్టంతో ధనవంతులు అవుతారు. వీరికి లక్ ఎక్కువ. వీరి జీవితం పూర్తిగా అదృష్టం మీదనే ఆధారపడి ఉంటుంది. వీరు బాగా సంపాదించే అదృష్టం, మంచి విలాసవంతమైన జీవితం గడిపే అదృష్టం ఉంది. వీరు ఎక్కువ లాభం ఉండే పనులు చేస్తారు, చేయాలి. వీరు సుఖపడ్డట్టు ఇతరులు సుఖపడలేరు. వీరు 6, 15, 24 తేదీలలో, శుక్రవారం రోజున గనుక పుట్టిఉంటే వీరు ధనవంతులు అవుతారు. విలాసవంతమైన జీవితం గడుపుతారు. వీరికి సంసార సుఖంపై కోరిక ఎక్కువ. వీరికి ఆకస్మిక ధనప్రాప్తి ఉంటుంది. ఇతరులవల్ల స్థిరాస్థులు వస్తాయి.

16. అరచేతిలో బుద్ధిరేఖ + లైఫ్‌లైన్ బాగుండి, కేతుస్థానం కూడా బాగున్నట్లయితే, ఆవ్యక్తి 7, 16, 25 తేదీలలో సోమవారం రోజున కనుక పుట్టి ఉంటే ఆ వ్యక్తికి భూత, భవిష్యత్, వర్తమాన కాలములను ఊహించే శక్తి ఉంటుంది. వీరు వీరి తెలివితేటలతో బ్రతకగలరు. వీరు ఏ వృత్తి అయినా చేసుకొని సంపాదించుకోగల సమర్థులు. వీరికి వ్యాపారం కూడా కలసివస్తుంది. అయితే వీరి జీవితంలో కష్టాలు + సుఖాలు రెండూ ఉంటాయి. ఎలాంటి విషయాన్ని అయినా సమర్థించగల సమర్థులు వీరు. వీరు అవసరం అనుకొన్నప్పుడు రాజీపడటం మంచిది. ఏ విషయాన్ని అయినా ఈజీగా తీసుకోవటం అవసరం వీరికి. అప్పుడే వీరు సుఖంగా ఉండగలుగుతారు.

17. అరచేతిలో గ్రహస్థానాలు బాగుండి, అరచేయి పొడవుగా, సన్నని, వంకర టింకర వ్రేళ్ళు కలిగి, అరచేయిలో శనిస్థానం బాగుండి వీరు 8, 17, 28 తేదీలలో శనివారం రోజున పుట్టి ఉంటే వీరు శని ప్రభావంవల్ల ఇంజనీర్లుగా, మంచి టెక్నికల్ వర్కర్సుగా, వ్యాపారస్థులుగా బాగా రాణించగలరు, సంపాదించగలరు. వీరికి ట్రాన్స్‌పోర్టు వ్యాపారం, మోటారు వాహనాల

వ్యాపారం, ఆయిల్స్, కెమికల్స్ వ్యాపారాలు కలసి వస్తాయి. వీరికి ఆరోగ్యం అంతగా బాగుండదు. వీరికి దైవభక్తి ఉంటుంది. స్వార్థం ఉండదు. నలుగురికి ఉపయోగపడాలను కొంటారు. వీరి అరచేతిలో శనిస్థానం బాగా ఉన్నంతంగా ఉంటే వీరు సన్యాసులుగా, బాబాలుగా, జ్యోతిష్కులుగా పేరు సంపాదించుకొంటారు. అయితే వీరికి సంసారజీవితం అంతగా బాగుండదు. సంసారజీవితంలో సుఖపడే యోగం తక్కువ. భార్యాభర్తలు విడిపోయే ప్రమాదం ఉంది. దైవబలం వల్లనే వీరికి మంచి జీవితం లభిస్తుంది. దైవాన్ని నమ్మటం వల్లనే వీరి ఆశలు ఫలిస్తాయి.

18. అరచేతిలో అన్ని గ్రహస్థానములు బాగుండి, అన్ని రేఖలు బాగుండి, ముఖ్యంగా కుజస్థానములు బాగుండి, వీరు 9, 18, 27 తేదీలలో, మంగళవారం రోజున పుట్టి ఉంటే వీరు బాగా చదువుకొని డాక్టర్లు, బ్యాంక్ ఆఫీసర్లు, ఎల్.ఐ.సి. ఆఫీసర్లు అయ్యే అవకాశం ఉంది. లేదా రాజకీయాలలో రాణించే అవకాశం ఉంది. వీరు బాగా శ్రమచేసి, ఎన్నో సమస్యలు ఎదుర్కొని జీవితంలో పైకి వస్తారు. స్వస్థలం వదలి పరస్థానంలో సెటిల్ అవుతారు. వివాహం తర్వాత వీరి జీవితం బాగుంటుంది. వివాహం వల్ల లాభపడే జాతకం వీరిది. అయితే వివాహ విషయంలో ఇద్దరి మధ్య అభిప్రాయ బేధాలు రాకుండా వీరు జాగ్రత్త పడటం చాలా అవసరం. వీరు ఎక్కువగా 40 సం॥ల వయస్సు తర్వాత మంచి లైఫ్ పొందుతారు.

19. అరచేయిలో గ్రహస్థానములు నీచంగా ఉండి, అరచేతిలో కేవలం మూడే రేఖలు ఉంటే, అవికూడా చిన్నవిగా, అస్పష్టంగా ఉంటే ఆవ్యక్తి జీవితం అతి సామాన్యంగా ఉంటుంది. ఆదాయం పెద్దగా ఉండదు. చాలీచాలనీ బ్రతుకుతో ఆ వ్యక్తి అతి సామాన్యమైన జీవితం కలిగి, ఆర్థిక ఇబ్బందులతో, కాలం గడుపుతారు. వీరు సుఖపడలేరు. వీరిని నమ్ముకొన్న వారికి న్యాయం చేయలేరు.

20. అరచేయిలో మూడు ప్రధాన రేఖలు జీవితరేఖ, బుద్ధిరేఖ, ఆత్మరేఖ స్పష్టంగా, లోతుగా, దీర్ఘంగా ఉండి గ్రహస్థానాలు బాగుంటే ఆ వ్యక్తి శ్రమ పడి, తన శ్రమతో పైకివస్తాడు. ఇతనికి మధ్యరకమైన జీవితం లభిస్తుంది.

